శ్లో॥ సోయంమునీన్ద్రజనమానస తాపహారీ సోయంమదవ్రజవధూవసనాపహారీ। సోయంతృతీయభువనేశ్వరదర్పహారీసోయంమదీయహృదయామ్బురుహాపహారీ॥ ... ... ౬౦

టీక. యః-ఎవ్వఁడు, మునీన్ద్రజనమానసతాపహారీ-మునీన్ద్ర-మునిశ్రేష్ఠులయొక్క, జన-సమూహముయొక్క, మానసతాప-మనస్తాపమును,హారీ-అపహరింపసమర్థుఁడో,సః-ఆపురుషుఁడు, అయం-ఇతఁడే,యః-ఏపురుషుఁడు, మదవ్రజవధూవసనాపహారీ-మద-మత్తులైన, వ్రజవధూ-గోపస్త్రీలయొక్క, వసన- వస్త్రములను, అపహారీ-హరింపసమర్థుఁడో, సః-వాఁడు, అయం- ఇతఁడే, యః-యెవఁడు, తృతీయభువనేశ్వరదర్పహారీ-తృతీయభువనేశ్వర- ఇంద్రునియొక్క, దర్ప- గర్వమును, అపహారీ- అపహరింపసమర్థుఁడో, సః- అతఁడు, అయం-ఇతఁడే, యః-ఎవఁడు, మదీయహృదయామ్బురుహాపహారీ- మదీయ-నాసంబంధమయిన, హృదయ-ఎదయనిమోడి, అమ్బురుహ-కమలమును,అపహారీ-అపహరింపసమర్థుఁడో,సః వాఁడు,అయం-ఇతఁడే.

ఉ॥ చిక్కరనాడుగోపికలచేలములెత్తినదొంగశైలముల్। చెక్కలుసేయువానిమదజృంభమునాచినదొంగభక్తిచే। నెక్కొనుమానికోటిమదినిల్పినపాపముఁబాపుదొంగనా। చొక్కపుఁజిత్తసారసముఁ బూరలుగాఁగొనుదొంగనేటికిఁ॥ ... ౬౦

తా. ఎవఁడుసకలమునులమనంబులంబొడముతాపంబులంగొల్లలాడెనెవ్వండెలజవ్వనంపు వ్రేతలచేలంబులంజూరగొనెనే పురుషుండింద్ర గర్వంబపహరించె నెవఁడు నాడెందంపుఁదామరం గొల్లగొనియె నట్టిపురుషుండితండేయనుట. ... ... ... ... *

శ్లో॥ సర్వజ్ఞత్వేచమౌగ్ధ్యేచ సార్వభౌమమిదంమమ। నిర్విశన్నయనంతేజోనిర్వాణపదమశ్నుతే॥ ... ... ౬౧

టీక. సర్వజ్ఞత్వేచ- సర్వజ్ఞత్వమందును, మౌగ్ధ్యేచ-సౌందర్యంబునను, సార్వభౌమమ్-సర్వభూమీశ్వరాతిశాయియగు, ఇదం-ఈపురోవర్తియయిన, తేజః- తేజముఁగూర్చి, నిర్విశత్- ప్రవేశించుచున్న, మమ - నాయొక్క, నయనం- నేత్రము, నిర్వాణపదం- మోక్షసుఖమును, అశ్నుతే- అనుభవించుచున్నది. ... ... *

మ॥ వినుసర్వజ్ఞతయందుమౌగ్ధ్యమునను ర్వీశసార్వభౌమంబునాఁ। జనునీతేజముఁ జూచి నానయనముల్సారూప్యముం జెందెవీ। దని

యాలోకముఁజేయఁగా భృమరకీటన్యాయముంగాంచికా। దనజ్ఞా
నేంద్రియగూఢికన్నులకు నేలాకల్గునూహింపఁగ౯॥ ... ౮౧

తా. సర్వజ్ఞత్వంబున సౌందర్యంబున సర్వాతిశాయియైయీ ముందు గా నంబడు తేజంబుఁగూర్చి ప్రవేశించు నానయనంబు మోక్షసుఖంబు ననుభవిం చుచున్నదియనుట. ... ... ❋

శ్లో॥ కృష్ణానమేతత్పునరుక్తశోభముష్ణేతరాంశో రుదయంముఖేన్దోః।తృష్ణాంబురాశిం ద్విగుణీకరోతి కృష్ణాహ్వయం కించన జీవితంమే॥

టీక. మే-నాయొక్క, జీవితం-జీవనమయినదియు, కిఞ్చన- ఇట్టిదియ నిచెప్పనలవిగానిదియు, కృష్ణాహ్వయం- శ్రీకృష్ణాఖ్యమునునగు, ఏతత్ -ఈపు రోవర్తివస్తువు, ముఖేన్దోః - ముఖచంద్రునివలన, ఉష్ణేతరాంశోః - చంద్రు నియొక్క, ఉదయం-ఆవిర్భావమును, పునరుక్తశోభం-పునరుక్త-ద్విగుణితమ గు,శోభం-కాంతిగలదిగా,కృష్ణానం-చేయుచున్నదియై,తృష్ణాంబురాశిం-ఆశా సముద్రమును, మే-నాయందు, ద్విగుణీకరోతి- రెండంతలుగాఁజేయుచున్నది.

మ॥ కమలోల్లాసకమైనిరంతరకళల్ గన్పట్టుశీతాంశుబిం। బము కంటె౯ ద్విగుణాభిరూప్యమునరమ్యంబైననెమ్మోముఁబు। న్నమజా బిల్లివెలుంగుతోవెలయుకృష్ణాభిఖ్యమానాదుజీ। వముతృష్ణాబ్ధితరంగ లక్ ద్విగుణమైవర్తిల్లఁజేసెన్నదిక౯॥ ... ౮౨

తా. నాజీవితంబగుచుం జెప్పనలవిగానిశ్రీకృష్ణాఖ్యంబగునీముందుకా నంబడువస్తువు నెమ్మొగంపుఁజందురునివలనఁబూర్ణిమయందుఁబొడముచందు రునికి వన్నియఁగల్పించునదియై నాయాం దాశా సముద్రంబును నెగడంజేయు చున్నదియనుట. ... ... ... ❋

శ్లో॥ తదేతదాతామ్రవిలోచనశ్రీసమ్భావితాశేషవినమ్రవర్గమ్।
ముహుర్మురారేర్మధురాధరోష్ఠంముఖామ్బుజం చుమ్బతి మానసంమే॥

టీక. ఆతామ్రవిలోచనశ్రీసంభావితాశేషవినమ్రవర్గం - ఆతామ్ర - ఈషదరుణములయిన, విలోచన - నేత్రములయొక్క, శ్రీ - కాంతిచేత, స మ్భావిత- బహూకరింపఁబడిన, అశేష- సమస్తమయిన, వినమ్రవర్గం-నతజ నసమూహముగలదియు, మధురాధరోష్ఠం- మధుర- మనోజ్ఞమగు, అధరో ష్ఠం-అధరముగలదియునునగు, మురారేః-శ్రీకృష్ణమూర్తియొక్క, యత్ -ఏ- ముఖామ్బుజం, ముఖకమలమును, మే- నాయొక్క, మానసమ్-మనస్సు,చు మ్బతి-ధ్యానముచేయుచున్నదియో, తత్ -ఆప్రసిద్ధమైనముఖము, ఏతత్ -ఇది.

చ॥ కలశపయోధిశీకరనికాయముచేనును గెంపుమీరు కన్నులన
తపాళికిం బ్రియము నూల్కొనఁ జేయుచుఁ దత్సుధాకణం। బులుమధు
రాధరోష్ఠమునఁ బూనినయాదిమదేవు మోముగా। వలెనదిగాకయు
న్నమెడఁ బల్కులు నామదియానఁ గోరునే॥ ... ౮౩

తా. ఈషదరుణంబులగునయనంబుల కాంతిచే సన్మానింపఁబడియెడియ
శేష సేవక సమూహంబుగలిగి - మనోజ్ఞంబగు నధరంబుచేఁ దేజరిల్లు నేశ్రీ
కృష్ణుని మోము దామరను నామానసంబానఁ గోరునో- అట్టిముఖంబెయీయగుప
డెడుముఖంబనుట. ... ... *

శ్లో॥ కరౌశరదుదఞ్చితామ్బుజవిలాసశిక్షాగురూ పదౌవిబుధపా
దపప్రథమపల్లవోల్లఙ్ఘినౌ। దృశౌ దళితదుర్మదత్రిభువనోపమానశ్రి
యావిలోకయవిలోచనామృతమహోమహచ్ఛైశవమ్॥ ౮౪

టీక. హేవిలోచన- ఓ నేత్రమా, అమృతమహః- అమృత- అమృత
మువలె, మహః- తేజముగలిగిన, మహచ్ఛైశవం- మహాత్-శ్రీకృష్ణమూర్తియొ
క్క, శైశవమ్- బాల్యమును, విలోకయ-చూడుము, కరౌ-హస్తములు,
శరదుదఞ్చితామ్బుజవిలాసశిక్షాగురూ-శరత్-శరత్కాలంబున, ఉదఞ్చిత-పు
ట్టిన, అమ్బుజ-కమలములయొక్క, విలాస- కాంతివిశేషములయొక్క, శిక్షా-
శిక్షించుటయందు, గురూ-నియామకములు, పదౌ- పాదములు, విబుధపాదప
ప్రథమపల్లవోల్లఙ్ఘినౌ- విబుధపాదప- కల్పవృక్షములయొక్క, ప్రథమ- నూ
తనములయిన, పల్లవ-చిగుళ్లను, ఉల్లఙ్ఘినౌ-అతిక్రమింపసమర్థములు, దృశౌ-
నేత్రములు, దళితదుర్మదత్రిభువనోపమానశ్రియా- దళిత - విదారింపఁబడి
న, దుర్మద - గర్విష్టములయిన, త్రిభువన - ముల్లోకంబులపదార్థంబులయొ
క్క, శ్రియా- కాంతులుగలవి. ... *

ఉ॥ పాదములంటిమా విబుధపాదపనూతనపల్లవావళిం। గాద
నుఁ గన్నుదోయి సగికాంతివిశేషము ముజ్జగంబునన్। లేదనుశారదాబ్జ
వనలీలల గేలవ గేరులోచనా। స్వాదమయారె శైశవవిలాసముగంటిమి
నందసూతికిన్॥ ... ... ౮౪

తా. శరత్కాలంబునం బొడము కెందమ్ములం గేరుకేల్గవయును వేలుపు
మ్రాకులం బుట్టిన క్రొత్త చిగుళ్లం దెగడు నడుగులును ముల్లోకంబులందుండెడిగ
ర్విష్ఠంబులగు పదార్థంబుల కాంతివిశేషంబులఁ బోవందోలు కన్నుఁగవయును గలి
గియమృతంబుఁ బోలి వెలయు శ్రీకృష్ణునిబాల్యంబునో నయనంబా చూడుమనుట.

శ్లో॥ ఆచిన్వానమహన్యహన్యహని సాకారాన్వి
రున్ధానమరున్ధతీహృదయమప్యార్ద్రస్మితాస్యశ్రియా
నన్యాజన్మనయనశ్లాఖ్యామనర్ఘ్యాం దశామావస్థాం వ్రజ
సామ్రాజ్యముజ్జృమ్భతే॥ ...

టీక. అహన్యహన్యహని-ప్రతిదినమును, సాకా
గూడిన, విహారక్రమాన్- విహారవిధులను, ఆచిన్వానం-
దియు, ఆర్ద్రస్మితాస్యశ్రియా- ఆర్ద్ర-సరసమైనదియు,
యునగు, ఆస్య- నెమ్మొగముయొక్క, శ్రియా- సంపద
యమపి-అరున్ధతీ-(పతివ్రతాశిరోమణియగు) వసిష్ఠభార్య
మపి- హృదయమునేనియు, అరున్ధానం- కొంచెమభిమ
దియు, అనన్యజన్మనయనశ్లాఖ్యాం-అనన్యజన్మ-మన్మథుని
త్రములచేత, శ్లాఖ్యాం- కొనియాడఁదగినదియు, అన
శాం- అవస్థను- ఆతన్వానం-విస్తరింపఁజేయుచున్నదియై
నతటీసామ్రాజ్యమ్- వ్రజసున్దరీ - గోపస్త్రీలయొక్క,
శములయందు, సామ్రాజ్యం-ఆధిపత్యరూపమైన శ్రీకృ
ఈషన్మందమగునటుల, ఉజ్జృంభతే- ప్రకాశించుచున్న

మ॥ నలినాస్త్రించుచుజోకకన్గొనుచునా
క్రొం। దళుకున్నవ్వులరుంధతీహృదయమైనంబో
గాఁ బ్రోద్దొకరూపమైమెలఁగు విన్నాణంబులం
జసుందరీస్తనతటీసామ్రాజ్యముప్పొంగెడిన్॥

తా. ప్రతిదినంబునాకారవంతంబులగు విహ
యుచుసరసంబగుముఖకాంతిచే నరుంధతీహృదయ
యంజాలి కన్నువిల్తునివలపింపంజాలిన గోపస్త్రీస్తన
శ్రీకృష్ణాఖ్యవస్తువునాకన్నులయెదుటం బ్రకాశించు

శ్లో॥ సముచ్ఛ్వసితయౌవనం తరళశైశవాల
లోచనం మదనముద్గహాసామృతమ్ । ప్రతిక్షణ
తవంశీముఖంజగత్రయవిమోహనంజయతిమా

టీక. సముచ్ఛ్వసితయౌవనమ్- సముచ్ఛ్వసిత
న్న, యౌవనమ్ - ఎల్లప్రాయముగలదియు, తరళ
చంచలమైన, శైశవ- బాల్యముచేత, అలఙ్కృతమ్

ఆతన్వానమ
సున్దరీస్తన తటీ
౬౫
క్రాన్- ఆకారముతోఁ
సంపాదించుచున్న
స్మిత-చిఱునగవుగలది
చేత, అరున్ధతీహృద
యొక్క, హృదయ
ఖముగఁజేయుచున్న
యొక్క, నయన- నే
ర్ఘ్యాం- శ్రేష్ఠమైన, ద
, వ్రజసున్దరీస్త
టీ - స్తనప్రదే
వస్తువు,ఆమన్దం-
*
చనెమ్మొము
గవిం । తలు
న । శ్చలనందవ్ర
... ౬౫
రక్రమంబులనెఱయంజే
బునైన స్వవశంబుగఁజే
సామ్రాజ్యరూపంబగు
తయనుట. *
కృతం మదచ్ఛురిత
లోచనం ప్రణయపీ
కంజీవితమ్॥ ౬౬
స్సగానావిర్భవించుచు
...తమ్- తరళ-

-మద- మన్మథమదముచేత, ఘురిత- ప్రూయఁబడిన, లోచ
మదచ్ఛురితలోచనందియు, మదనముగ్ధహాసామృతమ్- మదన- మన్మథునిచేత,
నం- నేత్రములు గలన, హాసామృతమ్- అమృతమువంటినగవుగలదియు, ప్రతి
ముగ్ధ-సుందరమయి ప్రతిక్షణ- అనుక్షణమును, విలోచనమ్ - చూచువారలకు
క్షణవిలోచనమ్ ప్రదించుచున్నదియు, ప్రణయపీతవంశీముఖం-ప్రణయ-
మోహమును సంపాదనము చేయఁబడిన, వంశీముఖం- వేణుముఖముగలయదియు,
ప్రేమచేత, పీత-పానం- జగత్త్రయ- మూఁడులోకములకు, విమోహనం-మో
జగత్త్రయవిమోహనదియునగు, మామకం-నాసంబంధమయిన, జీవితం-ప్రా
హకజనకమయినయాఖ్యవస్తువు, జయతి-సర్వోత్కర్షముగావర్తించుచున్నది.
ణపదమయినశ్రీకృష్ణతంతకునీటుచేతఁ దళుకొందంజూతు బాల్యంబువె।

మ॥ తలపం వ్వు క్రొందళుకు పీనెన్నేత్రముల్మోవికిఁ । గలవం
న్నెలనేలెఁదెలిస మరెలోకంబుల్విలోకించియు । వ్విళులూతెన్నదినా
శీముఖచుంబనంబు శ్వేఁగృష్ణాకృతిఁ॥ ౮౬

దుజీవితమ ... యగఁగనఁబడుజవ్వనంబుగల్గుటంజేసిజాఱుచున్న బాల్యం
తా ... మదనమాంద్యంబుఁ దెల్పుకన్దోయి సెలంగనమృతంబుం
బుచేనలంకరిం ... బ్రతిక్షణంబును జూచువారలకు మోహంబుత్పాదించు
బోని లేనగవు ... ణుముఖంబుఁ జుంబనంబు చేయుచు జగత్త్రయమనోహ
చు నతిప్రేమంబ ... కప్రాయంబైన శ్రీకృష్ణాఖ్యవస్తువు సర్వోత్కర్షముగా
రంబై వెలయునా ... ౦. ❋
వర్తించుచున్నదియు, తదేతచ్చరణారవిన్దం చిత్రంతదేతన్నయనారవి

శ్లో॥ చిత్రంతద్వదనారవిన్దం చిత్రంతదేతత్పునరప్యచిత్రమ్॥
న్దం । చిత్రంతదేతచ్చరణారవిన్దమ్-తత్-ఆశ్రీకృష్ణమూర్తియొక్క, ఏతత్-

టీక. తదేతచ్చరణారవిన్దం- పాదకమలము, చిత్రం-ఆశ్చర్యజనకమ
ఈయగుపడుచున్న, చరణారవిన్దం - తత్- ఆశ్రీకృష్ణమూర్తియొక్క, ఏతత్ -
యినది, తదేతన్నయనారవిన్దం- నేత్రకమలము, చిత్రం-ఆశ్చర్యసంపా
దకమగుపడుచున్న, నయనారవిన్దం- తత్ - ఆశ్రీకృష్ణమూర్తియొక్క, ఏత
జకమయినది, తదేతద్వదనారవిన్దం- ముఖకమలము- చిత్రం- ఆశ్చర్యకర
త్- ఈయగుపడుచున్న తత్- పునః- వెండియు- తదేతత్-అట్టిపాదారవిందా
మయినది- నారవిన్ద కృష్ణాఖ్యవస్తువు- చిత్రంచిత్రం - మిక్కిలియాశ్చర్య
ద్యావయవవిశిష్ట- ... ... ... ❋

ఉ॥ లోకములోనమోహితులు విలోచనముల్పదము ల్సహస్రసం। ఖ్యాకములంచునెంచు శ్రుతులాపురుషోత్తము నిర్విధంబుగా । నీకను దమ్మిదోయి చెలువీముఖసారస మీపదాబ్జముల్ । చేకొనఁజిత్రమం చునుతిచేయఁగఁబల్మఁబునంబశక్యమే॥ ... ... ౮౩

తా. ఇట్టిదియనిచెప్పనలవిగాని యడుగుదామరలునుగనుదమ్ములును నెమ్మోము విరిదమ్మియునుంగల శ్రీకృష్ణునినుతింపఁగనో యంచా మిక్కిలిచి త్రమనుట. ... ... ... ❀

శ్లో॥ అఖిలభువనైకభూషణమధిభూషితజలధిదుహితృకుచకు మ్భమ్ । వ్రజయువతిహారవల్లీమరకతనాయకమహామణింవన్దే॥ ౮౪

టీక. అఖిలభువనైకభూషణం-అఖిల-సమస్తమయిన,భువన-లోకము లకు- ఏకభూషణం-ముఖ్యభూషణమయినట్టియు- అధిభూషితజలధిదుహితృ కుచకుమ్భం- అధిభూషిత- అలంకరింపఁబడిన- జలధిదుహితృ-లక్ష్మియొక్క- కుచకుమ్భం- కలశములవంటిస్తనములుగలయట్టియు - వ్రజయువతిహారవల్లీ మరకతనాయకమహామణిం- వ్రజయువతి - గోపికలయొక్క- హారవల్లీ- తీ వియలవంటిహారములయొక్క- మరకత- మరకతమణియనెడి- నాయకమహా మణిం- స్థూలనాయకరత్నమయినశ్రీకృష్ణమూర్తినిగూర్చి - వన్దే- నమస్క రించుచున్నాను. ... ... ❀

చ॥ జలనిధికన్యకా ఘనకుచస్థలి పచ్చలతాళిగోపికా। విలసితహా రనీలమణివిశ్వజగద్వలయ ప్రకాశకో। జ్జ్వలమహనీయ రత్నమనివా రిత కాళియభోగి భోగమం। డలగిరివజ్రమై వెలయునందతనూజు భ జింతునామదిన్॥ ... ... ౮౫

తా. ఎల్లలోకంబులకుభూషణంబై మహాలక్ష్మిస్తనమండలంబునకలం కారరత్నంబై గోపస్త్రీహారమధ్యంబుల నింద్రనీలనాయక మణియై వెలయు శ్రీకృష్ణదేవునింగూర్చి మ్రొక్కెదననుట. ... ❀

శ్లో॥ కాన్తా కచగ్రహణవిగ్రహబద్ధలక్ష్మీ ఖణ్డాఙ్గరాగరసరఞ్జితమఞ్జులశ్రీః । గణ్డస్థలీముకుర మణ్డలఖేలమాన ఘర్మాఙ్కురంకిమపి ఖేలతికృష్ణ తేజః॥ ౮౬

టీక. కాన్తాకచగ్రహణవిగ్రహబద్ధలక్ష్మీఖణ్డాఙ్గరాగరసరఞ్జితమఞ్జు లశ్రీః- కాన్తా- ప్రియురాలియొక్క- కచగ్రహణ- కేశగ్రహణముయొక్క - విగ్రహ- కలహమందు- బద్ధ- గ్రహింపంబడిన- లక్ష్మీ- రుక్మిణిదేవియొక్క-

ఖణ్డ- చిటిలిన- అఙ్గరాగ- మెయిపూఁతచేత- రఞ్జిత-అలంకరింపఁబడిన-వక్షుల- మనోహరమయిన-శ్రీః- సంపదగలయట్టి-గణ్డస్థలీముకురమణ్డలఖేలమానఘర్మాఙ్కురమ్- గణ్డస్థలీముకురమణ్డల- అద్దములవంటిచెక్కిళులయందు- ఖేలమాన- నృత్యముచేయుచున్న- ఘర్మాంకురమ్-చిఱుచెమ్మటగలయట్టిశ్రీకృష్ణతేజము- కిమపి- ఇట్టిదియనిచెప్పనలవిగానిదియై- ఖేలతి- ప్రకాశించుచున్నది.

మ॥ తళుకున్నిద్దపుఁ జెక్కుటద్దములపై ఘర్మాంకురంబూఁగఁగాఁ।
గలికాభోగ పయోధరాంతర లసత్కాశ్మీర సంబంధగం।ధిలవక్షస్థ
లుఁడై గృహీతఘనవేణీ బంధుఁడై నెయ్యపుం। జెలియంజుంబనకేళిఁ
దేల్చు హరివాచిత్తంబునం జెందెడున్॥ ౭౯

తా. కేశగ్రహణ కలహంబునకుం దాల్చిన రుక్మిణీదేవి స్తనమండలంబునం జిటిలినయంగరాగంబుచే నలంకరింపఁబడినదియై యద్దంబులంబోలుచెక్కిళులం జిఱుచెమటలూరం జెలంగు శ్రీకృష్ణ తేజంబు సెప్పనలవిగాక వెలుంగుచున్నదియనుట. ... ... ❀

శ్లో॥ మధురంమధురం వపురస్యవిభోర్మధురంమధురం వదనంమ
ధురమ్ । మధుగన్ధిమృదుస్మిత మేతదహోమధురంమధురం మధురం
మధురమ్॥ ... ... ౮౦

టీక. అస్య-ఈముందటనగుపడియెడి-విభోః- శ్రీకృష్ణమూర్తియొక్క- వపుః- శరీరము- మధురంమధురం- మిక్కిలిసుందరము-మధుగన్ధిమృదుస్మితం- మధు- మకరందమువలె-గన్ధి- పరిమళముగల- మృదు- కోమలమయిన-స్మితం- లేనగవుగల- అస్యవిభోః- ఈకృష్ణమూర్తియొక్క-మధురం-సుందరమయిన- వదనం- ముఖము- మధురంమధురం- మిక్కిలిసుందరము- ఏతత్- ఈకానంబడుచున్న-శ్రీకృష్ణతేజము - మధురంమధురంమధురంమధురం - మిక్కిలిమనోహరమయినది-అహో-ఆశ్చర్యము. ... ❀

శా॥ చూడంజూడఁగ మేనఁదానినుమడించు న్మాధురీసంపదల్।
సూడంజూడఁగ మోముగోము మదిమెచ్చుల్గొల్పు మున్మాటికిం। జూ
డంజూడ మరందబిందువుల మించున్మందహాసంబునీ। జాడంబల్మఱుమా
ధురిం జెలఁగు నాస్వామిన్విలోకించెదన్॥ ౮౧

తా. చూడంజూడ నెమ్మేనసోయగంబినుమడించుమకరందబిందువులం దెగడులేనగవు నెమ్మొగమునందుసందడించు నిట్టివేషంబులంగలిగియీయనుపమ శ్రీకృష్ణతేజంబదలిసౌందర్యంబత్యాశ్చర్యంబుఁ బుట్టించుచున్నదియనుట.

శ్లో॥ శృంగారరస సర్వస్వం శిఖిపిఞ్ఛవిభూషణమ్ । అఙ్గీకృతన
రాకారమాశ్రయేభువనాశ్రయమ్॥ ... ౯౧

టీక. శృంగారరససర్వస్వం- శృఙ్గారరస- శృంగారరసముయొక్క, సర్వస్వం- సర్వార్థరూపమయినవాఁడును- శిఖిపిఞ్ఛవిభూషణం-శిఖిపిఞ్ఛ-నెమలిపురి, విభూషణం-అలంకారముగాఁగలవాఁడును, అఙ్గీకృతనరాకారం-అఙ్గీకృత- స్వీకరింపఁబడిన, నరాకారం-మనుష్యశరీరముగలవాఁడును, భువనాశ్రయమ్ - లోకాధారుఁడునైనశ్రీకృష్ణుని, ఆశ్రయే - సేవించుచున్నాను.

ఉ॥ చక్కనివానిముద్దు వెదఁజల్లెడువాని దయారసంబుచే। నె
క్కొనువాని మౌళితటినించినపింఛము వానిలోకముల్ । మ్రొక్కఁగ
నేలువానినతిమోహన మానుషవేషధారియై। యెక్కడలేనివానిజగ
దాశ్రయునెప్పుడునాశ్రయించెదన్॥ ... ౯౧

తా. రాశిగాఁజేయఁబడిన శృంగారరసంబు శరణిందేజరిల్లుచు నెమలిపురి యలంకారంబుగధరియించి మనుష్యదేహంబుచే వెలుంగులోకాశ్రయుండైన శ్రీకృష్ణమూర్తినాశ్రయించుచున్నాననుట. ... ✻

శ్లో॥ నాద్యాపిపశ్యతికదాచనదర్శనేన చిత్తేనచోపనిషదాసుదృ
శాంసహస్రం । సత్వంచిరంనయనయోరనయోః పదవ్యాంస్వామిన్
కదానుకృపయామమసన్నిధత్తే॥ ... ౯౨

టీక. సుదృశాం- విద్వాంసులయొక్క, సహస్రం- సహస్రసంఖ్యగలసమూహము, అద్యాపి- ఈదినమందైనను, కదాచన- మఱియొకకాలంబుననైనను, దర్శనేన-నేత్రముచేత, చిత్తేన- చేతస్సుచేత, ఉపనిషదాచ-వేదాంతశాస్త్రముచేతనైన, త్వాం-నిన్ను, చిరం-బహుకాలమునుండి,నపశ్యతి-చూడదు, హేస్వామిన్- ఓకృష్ణ, సత్వం- ఆనీవు, మమ-నాయొక్క, అనయోః- ఈప్రకృతిసంబంధములగు, నయనయోః- కన్నులయొక్క, పదవ్యాం- మార్గమునందు, కృపయా-దయచేత, కదాను-ఎప్పుడు, సన్నిధత్తే-సన్నిధానముచేయుచున్నావు. ... ... ✻

ఉ॥ కొందఱుయోగదృష్టి నొకకొందఱు వేదవిచారవాసనం। గం
దురునిన్నునెప్పుడొయొకానొక వేళనఖిజ్ఞులైనవా । రందఱునిట్టినీవుక
రుణాంబుధి ప్రాకృత దృష్టిఁజెందునా । ముందటనిల్చియెన్నఁడుఁ బ్ర
మోదమొనర్తువునందనందనా॥ ౯౨

తా. వేలసంఖ్యలుంగలవిద్వాంసులు గొందఱుయోగనిష్ఠంబగుమనంబు న్నసైన విజ్ఞానవంతంబగుచూపున్నసైన వేదాంతశాస్త్రంబునసైన నెంతకాలం బునకునిన్నుంగాంచనోపరట్టియవాఙ్మనసగోచరుండవగు నీవుకేవలప్రకృతి సంబంధంబుగలవాకన్నులకెన్నటికింగానంబడువాఁడవోకదాయనుట.

శ్లో॥ కేయంకాన్తిః కేశవత్వన్ముఖేన్దోః కోయంవేషః కాపివాచామభూమిః। సేయంసేయం స్వాదుతామఞ్జులశ్రీ ర్భూయోభూయోభూయశస్త్వాంనమామి॥ ౬౩

టీక. హేకేశవ- ఓశ్రీకృష్ణ, త్వన్ముఖేన్దోః - త్వత్ - నీయొక్క, ముఖేన్దోః - ముఖచంద్రునియొక్క, ఇయంకాన్తిః - ఈకాంతి, కా- ఎట్టిదియనిచెప్పవచ్చును, అయంవేషః - ఈయలంకారము, కః - ఎట్టిదియనవచ్చును, సాసా - ఆయాప్రసిద్ధంబగు, ఇయమియంస్వాదుతా - ఈయీలావణ్యము, మఞ్జులశ్రీః- సౌందర్యలక్ష్మియును, వాచామభూమిః-వాగగమ్యము, తత్-ఆకారణమువలన, భూయోభూయః-మాటిమాటికి, భూయశః- అధికముగ, త్వాం- నినుఁగూర్చి, నమామి- మ్రొక్కుచున్నాను. ... *

ఉ॥ ఎక్కడిగోపరూపమది యెక్కడిముద్దుమొగంబుసోయగం। బెక్కడనీకళావిభవ మెక్కడనేమనియెన్నవచ్చున। మ్మక్కటయగోచరంబుభవదాకృతి పద్మభవాదిసూక్తికిఁ। మ్రొక్కెద నారెసారెకున మోహనరూపయనినందనందనా॥ ౬౩

తా. ఇట్టిదియనిచెప్పనలవిగానినెమ్మొగంపుఁజందురునికాంతియువాచామగోచరంబగు నలంకారమునునుడువ నశక్యంబగులావణ్యంబును మనోహరంబగుసౌందర్యసంపదయుంగల్గియుండుఁగాననిట్టినినుంగూర్చి మ్రొక్కుచున్నానముట. *

శ్లో॥ వదనేన్దువినిర్జితశ్శశీ దశధాదేవపదంప్రపద్యతే। అధికాంశ్రియమశ్నుతేతరాంతవకారుణ్యవిజృమ్భితంకియత్॥ ౬౪

టీక. హేదేవ- ఓకృష్ణ, శశీ-చంద్రుఁడు, తవ-నీయొక్క, వదనేన్దువినిర్జితః- వదనేన్దు- ముఖచంద్రునిచే, వినిర్జితః- తిరస్కరింపఁబడినవాఁడై, దశధా- పదినఖములగుచు, పదం-పాదయుగళమును, ప్రపద్య-పొంది, అధికాం- అధికమయిన, శ్రియం- కాంతిని, అశ్నుతేతరాం- పొందుచున్నాఁడు, తవ-నీయొక్క, కారుణ్యవిజృమ్భితం-కారుణ్యాతిశయము, కియత్-ఎంతనవచ్చును.

ఉ॥ ఆననకాంతితోడ నెదురానిశశాంకుఁడునిల్వలేకనీ। మానిత

పాదపద్మములమాటునఁజేరినఖాంకురాకృతిం। బూనిభజించినంత నె
సమున్నతిశ్రీలొనఁగూర్చితౌరనీ । దీనదయాపరత్వము నుతింపఁగశ
క్యమెనందనందనా॥ ... ... ౯౪

తా. చందురుండు నీముఖచంద్రునెదిరించియోడి పదితెఱంగుల నీప
దంబులనఖరూపంబున నాశ్రయించినంతనధికంబగు కాంతినొందె నిట్టినీదయ
కెయ్యదియుసాటిలేదనుట. ... ... ... *

శ్లో॥ తత్త్వన్ముఖంకథమివాబ్జసమానకక్ష్యం వాఙ్మాధురీబహు
ళపర్వకళాసమృద్ధం। తత్కింభవేత్తదపరంభువనైకకాంతంయస్యత్వ
దాననసమాసుషమాసదాస్యాత్॥ ... ౯౫

టీక. వాఙ్మాధురీబహుళపర్వకళాసమృద్ధం - వాఙ్మాధురీ - వచో
మాధుర్యమనియెడి, బహుళ- అధికమయిన, పర్వకళా- పూర్ణిమాకళలచే,
సమృద్ధం- అతిశయించిన, తత్-ఆప్రసిద్ధమైన, త్వను ఖం - త్వత్- నీయొ
క్క, ముఖం - నెమ్మొగము, అబ్జసమానకక్ష్యం- అబ్జ - చంద్రకమలము
లతోడ, సమానకక్ష్యం-సమానకోటిగలది, కథం-ఎటుల, భవేత్-అయ్యెను,
యస్య-ఏపదార్థమునకు, సదా-ఎప్పుడును, త్వదాననసమా-త్వదానన-నీము
ఖముతోడ, సమా-సమానమగు, సుషమా-ఉత్కృష్టకాంతి, స్యాత్-అయ్యె
ను, అపరం-మఱియొకటి, భువనైకకాంతం- భువన-లోకములయందు, ఏక-
ముఖ్యమగు, కాంతం-సుందరము, స్యాత్- అయ్యెను, తత్-అది, కిం- ఏది.

చ॥ సరసిజమంటిమాతగదు సాటికిసారదపూర్ణిమాసుధా। కర
రుచియంటిమాసమము గాదిఁకవేఱజగంబునన్మనో । హరమగువస్తు
వొండొకటియారసిచూడనొకానొకప్పుడుం। బురుదుఘటిల్లునేభువ
నమోహననీముఖకాంతకాంతికిన్॥ ... ... ౯౫

తా. వచోమాధుర్యంబును బూర్ణిమ కళలచే సమృద్ధంబగు నీమో
ముతోడం జంద్రకమలంబులు సమంబులెటులగును నీమోముతోడ భువనంబు
ల నెల్లపదార్థంబులు సమంబులనుచుం జెప్ప నెయ్యదియుఁ గానంబడమిసిద్ధం
బుగాన నీసమానుం డొక్కండును లేడనుట. ... *

శ్లో॥ శుశ్రూషసేయదివచశ్శ్రుతిభిర్మమకీనం పూర్ణైర్వరపూర్వక
విభిర్నకటాక్షితంయత్। నీరాజనక్రమధురంభవదాననేన్దోర్నిర్వ్యా
జమహార్ఘతిచిరాయశశిప్రదీపః॥ ... ౯౬

టీక. హేకృష్ణ-ఓకృష్ణ, శుశ్రూషసేయది-వినినిచ్చయించితేని, పూ

ర్వైః-మొదటివారలయిన, అపూర్వకవిభిః- అపూర్వ - చమత్కారసంపాదకప్రబంధములను జెప్పిన, కవిభిః వాల్మీకాదిమహాకవులచేత, యత్-ఏవాక్యము, నకటాక్షితం-చెప్పఁబడలేదో, మామకీనం- నాసంబంధమైన, వచః-వాక్యమును, శ్రుణు-వినుము, శశిప్రదీపః- శశి- చంద్రరూపమైన, ప్రదీపః-దీపము, భవదాననేందోః- భవత్-నీయొక్క, ఆననేందోః- ముఖచంద్రునియొక్క, నీరాజనక్రమధురం - నీరాజన - నివాళియొక్క, క్రమ- విధియొక్క, ధురం-భారమునుగూర్చి, నిర్వ్యాజం-ఉపాధిలేనటులు, చిరాయ- బహుకాలము,అర్హతి- తగుచున్నది. ... ... ❀

చ॥ తొలుతటివ్యాసముఖ్యకవిధుర్యులుపల్కని సాహసంబునే।
వలికెదవింటివేని వినుపంకజలోచననీదుమోముతోఁ। గలువలతేని
సాటియనఁగాఁదగ దారతిపళ్లెరంబులో। పలవిడిదివ్వెగానతనిఁబట్టి
నివాళియొనర్పఁగాఁదగున్॥ ... ... ౯౬

తా. ఓకృష్ణా నాపలుకొక్కటివింటివేని వినుము పూర్వులగు వాల్మీకివ్యాసాది మహాకవులచేఁ జెప్పఁబడని సాహసంపుమాట నుడివెద నెట్ల నినఁ జంద్రుఁడని యెడిదీపంబు నారతిపళ్ళెరంబుననిడి నీనెమ్మోముజందురునికి నివాళియొనర్పం దగుననుట. ... ... ❀

శ్లో॥ అఖణ్డనిర్వాణరసప్రవాహై ర్విఖణ్డితాశేషరసాంతరాణి।
నియంత్రితోద్వాన్తసుధార్ణవాని జయంతిశీతానితవస్మితాని॥ ౯౭

టీక. అఖండనిర్వాణరసప్రవాహైః- అఖండ- పరిపూర్ణమైన, నిర్వాణ-సుఖమనియెడి, రస- ఉదకముయొక్క, ప్రవాహైః- ప్రవాహములచేత, విఖండితాశేషరసాంతరాణి- విఖండిత- కొట్టఁబడిన, అశేష-సమస్తమైన, రసాంతరాణి- ఇతరరసములుగలవియు, నియంత్రితోద్వాంతసుధార్ణవాని- నియంత్రిత- యథేచ్ఛమగునటుల, ఉద్వాంత-బయలువెడలుచున్న, సుధార్ణవాని- అమృతసముద్రముగలయవియు, శీతాని- చూచుజనులకుమనోహరమయినవియునగు, తవ-నీయొక్క, స్మితాని- లేనగవులు, జయంతి- సర్వోత్కర్షముగావర్తించుచున్నవి. ... ... ❀

మ॥ కలితానందమహానుభావమున వేడ్కం జెందియంతంతకుం।
జెలియంబొంగుసుధాతరంగిత పయోధిన్ లీలగన్పించుచు। న్దళితాశే
షరసాంతరంబులగు లేనవ్వుల్ మిటారింపగో। కులకాంతాజనభోగ
భాగ్య మహిమాంకూరంబు నెల్వొందెడిన్॥ ౯౮

తా. సంపూర్ణంబగు సుఖరసప్రవాహంబులచే సిరసింపఁ జడిన యుత్తరరసంబులుగలిగి యథేచ్ఛముగునటుల బయలు వెడలు సమ్మోతసమూద్రంబుగలిగి చూచువారలకు సుఖంబొనర్చు నీచిబునగవులు సర్వోత్కర్షకమౌగా వతిశయించుచున్నవియనుట. ... ... ...

శ్లో॥ కామంసంతుసహస్రశః కతిపయేస్వారస్యధౌరేయకాః। కామంవా కమనీయతాపరిమళస్వారాజ్యబద్ధవ్రతాః। తైర్నైవంవివదామహేనచవయం దేవప్రియంబ్రూమహేయత్సత్యం రమణీయతాపరిణతిస్త్వయ్యేవపారంగతా॥ ౯౭

టీక. కతిపయే-కొందఱు, స్వారస్యధౌరేయకాః- సౌందర్యవంతులు, కామం-యథేచ్ఛముగాను, సంతు- ఉందురుగాక, కమనీయతాపరిమళస్వారాజ్యబద్ధవ్రతాః- కమనీయతా- సౌందర్యముయొక్క, పరిమళ- ఆధిక్యమనియెడి, స్వారాజ్య-స్వర్గరాజ్యమందు, బద్ధ కూడుకొన్న, వ్రతాః- పుణ్యవిశేషములుగల, సహస్రశః - వేలసంఖ్యలు, కామం - యథేచ్ఛముగను, సంతు-ఉందురుగాక, హే దేవ-శ్రీకృష్ణ, తైః-ఆయధికసుందరులయినవారితోడ, నవివదామహే-వివాదమునుజేయము, ఏవం-ఈప్రకారము, ప్రియంచ-ప్రియమును, నబ్రూమహే-నుడువము, యత్-ఏకారణమున, రమణీయతాపరిణతిః- రమణీయతా - సౌందర్యముయొక్క, పరిణతిః-పరిపాకము, త్వయ్యేవ-నీయందే, పారంగతా-సంపూర్ణముగానుండును, సత్యం-యథార్థము.

ఉ॥ లోకములోపలన్ రసిక లోకమనేకముగల్గుఁగాకయు। స్తోకమనోహరావయవశోభితులుందురుగాకవారితో। నేకలహింపనేల మొగమిచ్చకమేటికిసత్యమాడెదన్। నీకమనీయతామహిమ నీకతగున్నటికానమెయ్యెడన్॥ ౯౭

తా. లోకంబుననేకరసికజనంబులుందురుగాక యధికసౌందర్యసంపన్నులనేకులుందురుగాక వారితోఁడంగలహంబునుప్రియంబునుంబలుక నేలయథార్థంబుగనుడివెద నీసౌందర్యంబుతోఁడంబుగణింప నెట్టివారలుంజాలరనుట.

శ్లో॥ మందారమూలేమదనాభిరామం బిమ్బాధరాపూరితవేణునాదమ్। గోగోపగోపీజన మధ్యసంస్థం గోపంభజేగోకులపూర్ణచంద్రమ్॥ ౯౮

టీక. మందారమూలే- మందార - కల్పవృక్షముయొక్క, మూలే-మొదటియందు, గోగోపగోపీజనమధ్యసంస్థమ్- గో-గోవులయొక్క యును,

గోప- గోపాలకులయొక్కయును, గోపీ- గోపస్త్రీలయొక్కయును, జన-
సమూహముయొక్క, మధ్య - నడుమను, సంస్థమ్ - కూర్చున్నవాఁడును,
బిమ్బాధరాపూరితవేణునాదమ్- బిమ్బ- దొండపండువంటి, అధర- అధరో
ష్ఠముచేత, అపూరిత-లెస్సగాఁబూరింపఁబడిన, వేణునాదమ్- వేణుధ్వనిగ
లవాఁడును, గోకులపూర్ణచంద్రమ్- గోకుల-గోసమూహమునకు, పూర్ణ
చంద్రమ్- రాకాశశాంకుఁడైనవాఁడును, మదనాభిరామమ్- మదన-మన్మ
థునికన్నను, అభిరామం - సుందరుఁడైనవాఁడునగు, గోపం- బాలగోపా
లుని, భజే- భజించుచున్నాను. ✽

ఉ॥ గోపికలోపికల్పడలి కొల్వఁగ గోపులుగోవులాడఁగాఁ। గ్రేపు
లుమేపులాని పరికింపఁగఁగెంజిగురాకుమోవిపై । మోపినవేణువర్గ
లము మ్రోయఁగఁగల్పవనిన్వసించునా। గోపకుమారమన్మథునిఁగో
కులవార్ధిశశిఁ భజించెదన్॥ ౯౯

తా. కల్పవృక్షమూలంబునగోవులయు, గోపాలకులయు, గోపిక
లయు నడుమనుండి కెమ్మోవియందు మోపినవేణువు మ్రోయించుచు మన్మ
థమన్మథుండై గోకులవార్ధిపూర్ణచంద్రుండై వెలయు బాలగోపాలుని భజి
యించెద ననుట. ✽

శ్లో॥ గళద్వ్రీడాలోలామదనవనితా గోపవనితా మధుస్ఫీతంగీ
తంకిమతిమధురాచాపలధురాః । సముజ్జృమ్భాగుమ్ఫా మధురిమగి
రాంమాదృశ గిరాస్త్వయి స్థానేజాతే దధతిచపలంజన్మసఫలమ్॥

టీక. గళద్వ్రీడాః - నిర్లజ్జలయిన, గోపవనితాః - గోపస్త్రీలు,
లోలాః-నీయందాసక్తలయి, మదనవనితాః- రతితుల్యలు, జాతాః- అయిరి,
గీతం-నీసంబంధమయినగానము, మధుస్ఫీతం-మధు- తేనెయావలె, స్ఫీతం- స్ఫూ
ర్తిగలదియై, కిమపి- చెప్పనలవిగానిది, జాతమ్- అయినది, చాపలధురాః-
చాపల- నీసంబంధమయిన చాపల్యముయొక్క, ధురాః- భారములు, మధు
రాః- మనోహరములు, జాతాః-అయినవి, మాదృశగిరాం- మాదృశ-నా
వంటియప్రతిజ్ఞునియొక్క. గిరాం వాక్యములయొక్క. గుమ్ఫాః-గుంభనలు.
మ రిమగిరాం- వాల్మీకిమొదలగు వారలయొక్క వాక్యములవలె. సముజ్జృ
మ్భాః- అతిశయములు. జాతాః అయినవి. త్వయి-నీవిషయము. జాతేసతి-
అగుచుండఁగా. చపలం-చపలమైన. జన్మ-జన్మమును. సఫలం- ఫలసహితమ
గునటుల. దధతి-వహించుచున్నవి. స్థానే-యుక్తము. ✽

ఉ॥ నాఁదొఱంగితత్తరము నన్నరులెత్తిన గోపకామినుల్। దేని
యుఁగుల్కుపాటలును దియ్యనిమాటలు నీకతంబునం। బూనిఫలంబుఁ
జెందుక్రియమోదముతోడను సన్నుతింపఁగా। నోనుదువుల్ఫలించెఁజ
ననంబుగృతార్థతఁజెందునెంతయున్॥ ౧౦౦

తా. గోకులంబునం గ్రుమ్మరుటం జేసియరసికలైనగ్రల్లజ్జలైన గోపస్త్రీల సౌందర్యంబులును గానంబులును జాపల్యంబులును నీయందు వినియోగించుకతంబునస్వసమానాధికరహితంబులైనభంగి నప్రతిజ్ఞుండనగునా వచనంబుల సందర్భంబును వాల్మీకిమొదలగు వారలవచోగరిమంబు కైవడిం బ్రసిద్ధంబగుచునీవలన వెలసెనుసేఁగృతార్థుండనైతిననుట. ❋

శ్లో॥ భువనంభవనంవిలాసినీశ్రీః స్తనయాతామరసాసనస్మరౌచ। ప
రిచారపరమ్పరా సురేన్ద్రాః స్తదపిత్వచ్చరితం విభోవిచిత్రమ్॥ ౧౦౧

టీక. హేవిభో- ఓకృష్ణా, భువనం- లోకము, భవనం-గృహము, శ్రీః-లక్ష్మీదేవి, విలాసినీ-పాణిగ్రహణభార్య, తామరసాసనస్మరౌచ-తామరసాసన- బ్రహ్మదేవుఁడును, స్మరౌచ-మన్మథుఁడును, తనయా-కుమారులు, సురేన్ద్రాః- దిక్పాలకాదులు, పరిచారపరమ్పరాః-పరిచార- పరిచారకులయొక్క, పరమ్పరాః- సమూహము, తదపి- అటులనైనను, త్వచ్చరితం-త్వత్- నీయొక్క, చరితం- చరిత్రము, విచిత్రం- మిక్కిలియాశ్చర్యము. ❋

మ॥ లలనారత్నము శ్రీవధూటిజగమెల్లం గేళికాసౌధమా। జల
జాతాసన శంబరారులునుతుల్ శక్రాదిదిక్పాలవ। ర్యులుభృత్యుల్వి
వరింపనీమహిమలోహా యిట్టిదైయుండగో। కులవాటంబున జా
రచోరకృతిలోకుల్ నవ్వఁగాంచుంతురే॥ ౧౦౧

తా. ఇల్లుముజ్జగంబుభార్యలోకైకమాతయగుసిరి- చతురాననుండునుమన్మథుండును కొమరులు- ఇట్టినీవు గోకులంబుననుండుటగుచిత్రంబనుట.

శ్లో॥ దేవస్త్రైలోకీ సౌభాగ్యకస్తూరీతిలకాఙ్కురః। జీయాద్వ్ర
జాఙ్గనానఙ్గ కేళీ లలితవిభ్రమః॥ ౧౦౨

టీక. త్రైలోకీసౌభాగ్య కస్తూరీతిలకాఙ్కురః- త్రైలోకీ- మూఁడులోకములయొక్క, సౌభాగ్య-అవయవసౌష్ఠవమునకు, కస్తూరీతిలకాఙ్కురః- కస్తురిబొట్టువంటివాఁడును, వ్రజాఙ్గనానఙ్గకేళీలలితవిభ్రమః- వ్రజాఙ్గనా- గోపస్త్రీలయొక్క, అనఙ్గకేళీ - మన్మథక్రీడలయందు, లలిత - సరస

మయిన, విభ్రమః- విలాసములుగలవాఁడునునగు, దేవః - శ్రీకృష్ణమూర్తి, జీయాత్- సర్వోత్కర్షముగావర్తించుఁగాక. *

మ॥ కులుకుం జెక్కులఁ బిక్కటిల్లు పులకాంకూరంబు తోరంబుగాఁ। దళుకుం గస్తురిబొట్టు నెన్నొసలిపైఁ ద్రైలోక్యభాగ్యాకృతిం। జెలఁగ గోపనితంబినీరతికళాశృంగారభావోన్నతుల్। దోలుకంగన్నులపండువైనవిభుఁ గాంతుం భాగ్యసంసిద్ధికిన్॥ ౧౦౨

తా. ముల్లోకంబుల సౌభాగ్యావయవంబులకుఁ గస్తూరీతిలకంబై గోపస్త్రీలతో ననంగక్రీడం జేయుట యందత్యంత విలాసంబులుగల శ్రీకృష్ణదేవుండు సర్వోత్కర్షంబుగా వర్తించుననుట. ●

శ్లో॥ ప్రేమదంచ మే కామదంచ మే వేదనంచ మే వైభవంచ మే।
జీవనంచ మే జీవితంచ మే దైవతంచ మే దేవనాపరమ్॥ ౧౦౩

టీక. హేదేవ- ఓకృష్ణ, మే-నాయొక్క, ప్రేమదంచ- ప్రేమంబునిచ్చువస్తువును, మే - నాయొక్క, కామదంచ - కోరికనిచ్చువస్తువును, మే-నాయొక్క, వేదనంచ- జ్ఞానమును, మే-నాయొక్క, వైభవంచ-ఐశ్వర్యమును, మే- నాయొక్క, జీవనంచ- ప్రాణమును, మే- నాయొక్క, జీవితంచ- జీవనహేతువస్తువును, మే- నాయొక్క, దైవతంచ- దైవతమును, అపరం-మఱియొకటి, నాస్తి- లేదు. *

ఉ॥ కోరికలిచ్చినన్నెనరుఁ గూర్చినజీవనజీవితమ్ములే। దారినొనర్చినం జెలిమిఁ దాల్చినఁదల్లియుఁ దండ్రియుంబలెన్। నేరములోర్చినం దిరుగనేర్పుగఁదీర్చినఁ గన్మియిచ్చినన్। భారమునీదెకాని మఱి పంకజనాభ యొఱుంగనన్యులన్॥ ౧౦౩

తా. కోరికనిచ్చినం బ్రియంబుఁ జేసిన నీవ నా జ్ఞానంబు నైశ్వర్యంబును జీవనంబును జీవనహేతువగు వస్తువును నాదైవతంబును నీవకాని మఱియన్యునే నెఱుంగననుట. *

శ్లో॥ మాధుర్యేణ విజృంభన్తాం వాచో న స్తవ వైభవే। చాపల్యేన వివర్ధన్తాం చిన్తా న స్తవ శైశవే॥ ౧౦౪

టీక. నః- నాయొక్క, వాచః- వాక్యములు, తవ-నీయొక్క, వైభవే- గోవర్ధనోద్ధరణాది వైభవమందు-మాధుర్యేణ-శ్లాఘ్యమగుటచే- విజృంభన్తాం- మిక్కిలియతిశయించుంగాక- నః-నాయొక్క- చిన్తాః-మనోవ్యాపార

ను, తవ-నీయొక్క, శైశవే- బాల్యమందు, చాపల్యేన- చపలతచే, వివ
ర్ధ౯ం- వృద్ధినొందుఁగాక. ... ... *

ఉ॥ నీనుభవత్కథామణులనెన్నెడు పట్లమదీయసూ క్తిసం। తా
నము మాధురీగుణవితానముఁజెందిపొసంగుఁగాతనా। మానసవృత్తినీ
దుసుకుమారకిశోరవయోవిహారమూ। ల్పానిపరించునట్లులతిలోలతఁ
గాంచియలంగుఁగావుతన్॥ ... ... ౧౦౪

తా. నావచనంబులునీగోవర్ధనోద్ధరణాదివైభవంబుల నతిమాధుర్యం
బుగనతిశయించుంగాక నామనోవ్యాపారంబులునీబాల్యంబున నతిచాపల్యం
బునంబెంపొందుఁగాకయనుట. ... ... *

శ్లో॥ యానిత్వచ్చరితామృతాని రసనాలేహ్యానిధన్యాత్మనాం।
యేవాశైశవచాపలవ్యతికరారాధాపరాధోన్ముఖాః।యావాభావిత
వేణుగీతిగతయోలీలాముఖామ్భోరుహే ధారావాహికయావహన్తు
హృదయేతాన్యేవతాన్యేవమే॥ ... ౧౦౫

టీక. ధన్యాత్మనాం- కృతార్థమనస్కులయొక్క, రసనాలేహ్యాని-రస
నా - జిహ్వలకు, లేహ్యాని - లేహ్యవిశేషములయిన, త్వచ్చరితామృతాని-
త్వత్ - నీయొక్క, చరితామృతాని - అమృతమువంటిచరిత్రములు, యాని-
ఏవిగలవో, రాధాపరాధోన్ముఖాః- రాధా- రాధావిషయమయిన, అప
రాధ-అపరాధములే, ఉన్ముఖాః-మొదలుగాఁగలవి, శైశవచాపలవ్యతికరాః
శైశవ-బాల్యమందలి, చాపల-చాపల్యముచేత, వ్యతికరాః- ఉద్వృత్తములు
యేవా- ఎవ్విగలవో, లీలాముఖామ్భోరుహే- లీలా- విలాసయుతమయిన,
ముఖామ్భోరుహే- ముఖకమలమందు, భావితవేణుగీతిగతయః- భావిత-పు
ట్టుచున్న, వేణుగీతి- వేణుగానముయొక్క, గతయః- భేదములు, యావా-ఏ
విగలవో, తాన్యేవతాన్యేవ-అవియేవియే-మే-నాయొక్క,హృదయే-హృదయ
మందు,ధారావాహికయా-ధారారూపముచేత,వహన్తు-ప్రవహించుఁగాక.

మ॥ అలరున్ధన్యులకే కథామృతము జిహ్వన్ లేహ్యమే బాల్య
చా। పలముల్ రాధకు నెయ్యముంగినుకనాపాదించు నేయందము। ల్వే
లయునోష్ఠమున వేణుగానకలనన్వేమాఱునాదివ్యచ। ర్యలెనామానస
వీధివేడెదనుధారాళంబుగానిల్వఁగన్॥ ... ౧౦౫

తా. కృతార్థులనాలుకలలేహ్యంబుంబోలెనుండునీచరితామృతంబుతే

వ్వియో రాధకుఁ బ్రియంబు నపరాధంబునుం జేయు నీచాపల్యోద్రేకము లె
యో విలాసయుతంబగు నీ నెమ్మోముఁ దామరయుంటుం బాడమిన వేణు
ప్రభేదంబు లెవ్వియో యవియవి నామనంబున ధారారూపంబుగఁ బ్రవహిం
చుచుండుఁగాక యనుట. ... ... ... ❀

శ్లో॥ భక్తిస్త్వయిస్థిరతరా భగవన్ యదిస్యాత్ దైవేననః ఫలితది
వ్యకిశోరవేషే। ముక్తిస్స్వయం ముకుళితాఞ్జలి సేవతేఽస్మాన్ ధర్మా
ర్థకామగతయస్సమయప్రతీక్షాః॥ ... ౧౦౬

టీక. హేభగవన్- షడ్గుణైశ్వర్యసంపన్నుఁడవైనయోశ్రీకృష్ణా, నః-
మాయొక్క, దైవేన- అదృష్టవిశేషముచేత- ఫలితదివ్యకిశోరవేషే-ఫలిత-స్వ
ఫలముచే సంపాదింపఁబడిన- దివ్య- అసాధారణమైన- కిశోరవేషే-బాలవేష
ముగల- త్వయి-నీయందు- భక్తిః-భక్తి- స్థిరతరా- మిక్కిలిదృఢమైనది-యది
స్యాత్- ఆయెనా- ముక్తిః- మోక్షము- ముకుళితాఞ్జలిః-ముకుళిత-మోడ్పఁ
బడిన- అఞ్జలిః- దోయిలిగలదియై- అస్మాన్-మమ్ము- సేవతే- సేవించుచున్న
ది- ధర్మార్థకామగతయః-ధర్మార్థకామ-ధర్మార్థకామములయొక్క--గతయః-
సంచారములు- సమయప్రతీక్షాః- సమయ - అవసరమును- ప్రతీక్షాః- కో
రుచున్నవి. ... ... ... ❀

ఉ॥ గోపకుమారవేషమునఁ గూడిననీయెడ భక్తిదైవసం। ప్రా
పితమైనదిన్ దృఢతరంబుగనిల్చినముక్తికన్యనా। దాపునఁగేలుమోడ్చి
సతతంబును గొల్వఁగ వేళఁజూచుమ। మ్మేపునఁబిల్చివీడ్కొలుప నేచి
నధర్మమునర్థకామముల్॥ ... ... ౧౦౬

తా. షడ్గుణైశ్వర్య సంపన్నుఁడవైన యోకృష్ణ నాభాగ్యంబున గో
పాలవేషంబూనిననీయందత్యంతభక్తి గలిగి నట్టులయ్యెనేని ముక్తికాంత నే
ల్మోడ్పుతోడ నెప్పుడునునన్ను సేవించుచునుండు ధర్మార్థకామంబులు నాయవ
సరంబుం గాంక్షించుచు నుండుఁగాన నీయందలిభక్తిగలిగిన నెద్దియునాకుదు
ర్లభంబులేదనుట. ... ... ... ❀

శ్లో॥ జయజయజయ దేవ దేవ దేవ త్రిభువనమఙ్గళ దివ్యనామధే
య।జయజయజయబాలకృష్ణదేవ శ్రవణమనోనయనామృతావతార॥

టీక. శ్రవణమనోనయనామృతావతార-శ్రవణ-కర్ణములకును-మనః-
మనస్సునకును-నయన-నేత్రములకు- అమృత- అమృతమువలె-అవతార-ఆవిర్భా
వము- హేదేవ- ఓకృష్ణ జయజయజయ- సర్వోత్కర్షముగావర్తింపుము-త్రి

భువనమఙ్గళదివ్యనామధేయ- త్రిభువన- ముల్లోకములకు, మఙ్గళ- శుభప్రద మయిన, దివ్య- అనితరసాధారణమయిన, నామధేయ-నామములుగల-హే బాలకృష్ణ-ఓబాలకృష్ణుండ, జయజయజయ-సర్వోత్కర్షముగావర్తింపుము, దేవదేవ- దేవ- దేవతలకు, దేవ-దేవుఁడైన- హే దేవ-ఓకృష్ణ- జయజయ- సర్వోత్కర్షముగావర్తింపుము.

చ॥ జయజయ దేవకృష్ణరిపుసైన్య మహోద్ధతిభేదకృద్ధనం। జ
యజయకారణాభువనసన్నుతమంగళనామధేయసం। జయజయబో
ధ సాధకవచశ్రుతి నేత్ర మనోమనోహరా । జయజయ విశ్వజన్మల
యశాసనగాఢతమోనిరాసనా॥ ౧౦౭

తా. శ్రోత్రంబులకు నేత్రంబులకుమనంబునకు నమృతంబువలె సుఖం బుఁజేయునుద్భవంబుగలిగి ముల్లోకంబులకునుశోభనకరంబులగుచునితరాసాధారణంబులగు దివ్యమంగళనామంబులుగలిగి దేవదేవుండవై వెలయుచున్న యోకృష్ణా సర్వోత్కృష్టుండవైయుండుమనుట. ❀

శ్లో॥ తుభ్యంనిర్భర హర్ష వర్ష వివశావేశ స్ఫుటావిర్భవ చ్చాపల్యై
నవిభూషితేషు సుకృతాం భావేషునిర్భాసతే। శ్రీమద్గోకులమణ్డనా
యమహతే వాచాంవిదూరస్ఫురన్మాధుర్యైక రసార్ణవాయమహసే
కస్మైచిదస్మైనమః॥ ౧౭౮

టీక.నిర్భరహర్షవర్షవివశావేశస్ఫుటావిర్భవచ్చాపల్యేన-నిర్భర-అతిశయమయిన- హర్షవర్ష-సంతోషవర్షముచేత, వివశావేశ-బాహ్యశూన్యతయందు- స్ఫుట-వ్యక్తమగునటుల, ఆవిర్భవత్- పొడముచున్న చాపల్యేన-చపలతచేత- విభూషితేషు- అలంకరింపఁబడిన, సుకృతాం- ధన్యులయొక్క, భావేషు- మనోవ్యాపారములయందు-నిర్భాసతే- మిక్కిలిప్రకాశించుచున్నవాఁడును, శ్రీమద్గోకులమణ్డనాయ- శ్రీమత్- సంపత్కరమయిన, గోకుల- గోసమూహమునకు, మణ్డనాయ-అలంకారమయినవాఁడును, మహతే-వ్యాపకుఁడైనవాఁడును- వాచాం- ఉపనిషత్తులకు-విదూరస్ఫురన్మాధుర్యైకరసార్ణవాయ- విదూర- మిక్కిలిదూరమున, స్ఫురత్- ప్రకాశించుచున్న- మాధుర్య-సౌందర్యమని యెడి-ఏక-ముఖ్యమైన-రస-రసమునకు-అర్ణవాయ- సముద్రుఁడైనవాఁడును కస్మైచిత్-చెప్పనలవిగాని, అస్మై- ఈయెదురనున్న- మహసే- తేజోరూపుఁడైనవాఁడువైన- తుభ్యం- నీకొఱకు- నమః-నమస్కారము.

శా॥ ఆనందంబున బాహ్యముల్మఱచి యాత్మారామలీలారతిన్।
ధ్యానుల్గాల్పఁగ మూంగ లన్నిలిచి వాచాగోచరంబై యశో। దానందాం
గణ రత్నమై మధురిమాధారార్ణవంబైన నెం। దేన మహోజ్జ్వల మట్టి తే
జమునకెంతే మక్కువన్మ్రొక్కెదన్॥ ౧౦౮

తా. సంపూర్ణంబగు సంతోషవర్షంబుచే బాహ్యంబు మఱచి వ్యక్తంబగునటుల బోడము బాహ్యంబున నలంకరింపబడిన ధన్యులమనంబులం బ్రకాశించుచుఁ గోకులంబున నలంకరించుచు నుపనిషద్గమ్యంబయ్యు నుదూరంబగు సౌందర్యాది గుణసముదయంబను రసంబున కర్ణవుండై యవాఙ్మానస గోచరుండై యీమూంగలంగానుపించు తేజోరూపుండవగు నీకొఱకు మ్రొక్కెదననుట.

శ్లో॥ ఈశానదేవచరణాభరణేన నీవిదామోదరస్థిర యశస్తబ
కోద్గమేన। లీలాశుకేన రచితం తవ దేవకృష్ణ కర్ణామృతం వహతు కల్పశ
తాన్తరేపి॥ ౧౦౯

టీక. దేవ-దేవుఁడవైన, హేకృష్ణ-ఓకృష్ణ, ఈశానదేవచరణాభరణేన- ఈశానదేవ- శివునియొక్క, చరణ- పాదములే- ఆభరణేన-భూషణములుగాగలవాఁడును- నీవిదామోదరస్థిరయశస్తబకోద్గమేన-నీవి-మూలధనమైన- దామోదర- శ్రీకృష్ణమూర్తియొక్క- స్థిర-నిశ్చలమయిన- యశః-కీర్తియనియెడి- స్తబక- పువ్వులగుత్తియందు- ఉద్గమేన-ఉన్ముఖుడైన- లీలాశుకేన-పోష్యాశుకంబుఁబోనిలీలాశుకునిచేత- రచితమ్- చేయఁబడిన శ్లోకసమూహము-కల్పశతాన్తరేపి- ఎప్పుడును-తవ- నీకు-కర్ణామృతం- కర్ణ-చెవులకు-అమృతం-అమృతమై- వహతు- పొందుఁగాక. ❋

మ॥ ఫలవాంఛన్ హరికీర్తిగుచ్ఛరతియున్ ఫాలాక్షు సంసేవ
యున్। గలలీలాశుకవాక్యముల్ తెలుఁగునన్ గర్ణామృతఖ్యాతిగా। న
లరంజేసితి వెల్లఫూఁడి మణి పెద్దామాత్య వెంగన్ననే। నలరుం దోయిలి
మాడ్కిఁ గైకొనుము కృష్ణా కల్పసంస్థాయిగన్॥ ౧౧౦

తా. ఓయీశ్రీకృష్ణ శివుని పాదంబు లాభరణంబుగ మనంబున ధరియించి యునఁగ శివునియందలి ద్వేషంబు తనకు లేదనుట దామోదరుండవైన నీకీర్తియనియెడి పూలరులగుత్తియందు ఫలాపేక్ష చేఁబోవ్యాశుకంబుఁబోలె వెలయు లీలాశుకుని చేర చింపంబడిన శ్లోకసమూహంబు నీకర్ణంబులకమృతంబగుచుఁ గల్పశతంబుల పర్యంతంబును శాశ్వతంబుగ నుండుంగాతయనుట. ❋

ప్ర థ మా శ్వా స ము

ఆశ్వాసాంతము.

---

మాలిని॥ తనుజితజలవాహా తారితశ్వేతవాహా। జననకృతతమోహా శాంతదుర్దాంతమోహా। యనఘగుణసమూహా యార్తరక్షస్సమూహా। వినకవిషయగేహా వేంకటాంహార్యగేహా॥

---

మ॥ ఇదికృష్ణాశ్రయయోగిపుంగవకృపావీక్షాత్తసారస్వతా।
భ్యుదయ శ్రీవిభవప్రసిద్ధచిదచిద్బోధకమాశాంతిస। త్యదయాభూ
షణవెల్లపూడిమణిపెద్దామాత్యవెంగాగ్రణీ। గదితాశ్వాసముపా
ల్చుఁబ్రాథమికమై కర్ణామృతశ్రీకృతిక॥

శ్రీకృష్ణకర్ణామృతము- ప్రథమాశ్వాసము.

---

స ం పూ ర్ణ ము.

---



శ్రీ ర స్తు.

## శ్రీకృష్ణకర్ణామృతము - ద్వితీయాశ్వాసము.

శ్లో॥ అభినవ నవనీతస్నిగ్ధమాపీతదుగ్ధం దధికణపరిదిగ్ధం ముగ్ధమ
ఙ్గంమురారేః । దిశతుభువనకృచ్ఛ్రచ్ఛేది తాపిఞ్ఛగుచ్ఛచ్ఛవి నవశిఖిపి
ఞ్ఛాలాఞ్ఛితంవాఞ్ఛితంనః॥ ౧

టీక. అభినవనవనీతస్నిగ్ధమ్- అభినవ-మిక్కిలినూతనమైన- నవనీత-వెన్నచేత- స్నిగ్ధమ్- స్వచ్ఛమైనట్టిదియు- ఆపీతదుగ్ధమ్-ఆపీత- పానముచేయఁబడ్డ- దుగ్ధమ్- క్షీరముగలదియు- దధికణపరిదిగ్ధమ్- దధి- పెరుగుయొక్క- కణ- బిందువులచేత- పరిదిగ్ధమ్- అంతటఁబూయఁబడినయదియు- తాపిఞ్ఛగుచ్ఛచ్ఛవి- తాపిఞ్ఛ- కానుగుచెట్టుయొక్క- గుచ్ఛ-పువ్వులగుత్తుయొక్క- ఛవి-కాంతివంటికాంతిగలయదియు- నవశిఖిపిఞ్ఛాలాఞ్ఛితం- నవ-నూతనమైన- శిఖిపిఞ్ఛ- నెమలిపురిచేత- ఆలాఞ్ఛితం- లెస్సగానలంకరింపఁబడినయదియు-భువనకృచ్ఛ్రచ్ఛేది - భువన- లోకములయొక్క- కృచ్ఛ్ర- ఉపద్రవములను - ఛేది-పోనడువసమర్థమునైన- మురారేః- శ్రీకృష్ణమూర్తియొక్క- ముగ్ధం-సుందరమైన- అఙ్గం- శరీరము- నః- మాయొక్క- వాఞ్ఛితమ్- అభీష్టార్థమును-దిశతు- ఇచ్చుఁగాక. ❀

శా॥ తాపింఛచ్ఛవియైవినీలనవనీ తస్నిగ్ధమైముగ్ధమై। యాపీతా
మితదుగ్ధమైదధికణై కాదిగ్ధమైలోకకృ। ఛ్రాపచ్ఛేదకమై వినీలశిఖిపిం
ఛాలాంచితంబైనశ్రీ। గోపాల ప్రభుమూర్తివాంఛిత మొసంగున్మా
కునశ్రాంతము౯॥ ౧

తా. క్రొత్తయగువెన్నచేనచ్ఛంబగుచుఁబానంబుచేయఁబడిన క్షీరంబుగలిగి దధికణంబులచేతఁబూయంబడినదియై లోకంబుల యుపద్రవంబులఁబోనడువసమర్థంబై కానుగుపువ్వులకాంతివంటికాంతిగలదియై నెమలిపురిచేనలంకరింపఁబడినదియై సుందరంబైన శ్రీకృష్ణునిశరీరంబు మాకఖిలాభీష్టంబులనిచ్చుంగాకయనుట. ❀

శ్లో॥ యాందృష్ట్వాయమునాంపిపాసురనిశంవ్యూహోగవాం
గాహతే । విద్యుత్వానితి నీలకణ్ఠనివహోయాం ద్రష్టుముత్కణ్ఠతే।

ఉత్తంసాయ తమాలపల్లవమితిచ్ఛిన్దంతియాం గోపి
యశాసనస్య వపుషస్సాపావనీ పాతు నః॥ ...

టీక. పిపాసుః-పానముచేయనిచ్ఛయించుచున్న, గవాం కుల-, వ్యూహః-సమూహము, యాం-ఏకాంతిని, యమునాం-యమునగా, దృష్ట్వా-చూచి, అనిశం-ఎప్పుడును, గాహతే-ప్రవేశించుచున్నదియో, నీలకంఠనివహః-నీలకంఠ-నెమళులయొక్క, నివహః-సమూహము, యాం-ఏకాంతిని, విద్యుత్వానితి-మేఘమునుగా, ద్రష్టుం-చూచుకొఱకు, ఉత్కంఠతే-సంతోషమునుజేయుచున్నదియో, గోపికాః-గోపికలు, యాం-ఏకాంతిని, తమాలపల్లవమితి- తమాల-నల్లకానుగుచెట్టుయొక్క, పల్లవమితి- చిగురుగా, దృష్ట్వా-చూచి, ఉత్తంసాయ-శిరోభూషణముకొఱకు, ఛిందంతి- ఛేదింపఁదలంచుచున్నారో, కాళియశాసనస్య-శ్రీకృష్ణమూర్తియొక్క, వపుషః-శరీరముయొక్క, సా-అప్రసిద్ధమైన, పావనీ-పావనమునైన, కాంతిః-కాంతి, నః-మమ్మును, పాతు-పరిపాలించుఁగాక. ... ... *

చ॥ అనిశముయామునాంబువిదియానెదమంచునుగోగణంబు
లెల్లనుజొరఁబర్హిపజ్తులువలాహకమంచునువేడ్కతోడఁగన్గొనఁ
గఁదమాలపల్లవముకొప్పునకౌనని గోపకామినుల్ చిదుమఁగనొప్పు
కృష్ణుని విశేషతనుద్యుతినన్నుఁబ్రోవుతన్॥ ... ... ౨

తా. గోసమూహంబును నెమళులపిండును వ్రేతలునేకాంతింగనుంగొనియమునానదియనియు మొగుళుల గుంపనియుఁ గానుగుచిగుళ్లనియు మనంబులందలంచచిత్రావనుంజూడనుంజిదుమనుం గమకించునో యట్టి శ్రీకృష్ణుని నెమ్మేని చాయ నన్నుంబ్రోచుఁగాకయనుట. ... ... *

శ్లో॥ దేవః పాయాత్పయసివిమలేయామునేమజ్జతీనాంయాచం
తీనామనునయపదైర్వఞ్చితాన్యంశుకాని। లజ్జాలోలైరలసవిలసైరు
న్మిషత్పుష్పబాణైర్గోపస్త్రీణాంనయనకుసుమైరర్చితః కేశవో నః॥ 3

టీక. విమలే-నిర్మలమైన, యామునే-యమునానదీసంబంధమైన, పయసి-నీటను, మజ్జతీనామ్-స్నానము చేయుచున్నవారును, వఞ్చితాని-దాచఁబడిన, అంశుకాని-వస్త్రములను, అనునయపదైః-వినయపుమాటలచేత, యాచంతీనామ్- యాచించుచున్నవారునగు, గోపస్త్రీణాం-గోపికలయొక్క, అలసవిలసైః- అలస-సౌమ్యములగుటచే, విలసైః-ప్రకాశించుచున్న, లజ్జాలోలైః-లజ్జా-సిగ్గుచేత, లోలైః- చంచలములైనవియు, ఉన్మిషత్పుష్పబాణైః-

...చున్న, పఞ్చబాణైః- మన్మథుఁడుగలవియును, నయన నేత్రములనియెడి, కుసుమైః-పువ్వులచేత, అర్చితః- పూజిం ...వః-శ్రీకృష్ణమూర్తి, నః-మమ్మును, పాయాత్- రక్షించుగాక.

...కము గోపాలకృష్ణమంత్రరాజమందలి వస్త్రాకర్షణప్రయోగధ్యానమని సనత్కుమారసంహితయందుఁజెప్పంబడియున్నది.

శ్లో॥ కదమ్బవృక్షమారూఢంగోపీవస్త్రాపహారిణం। కృష్ణంధ్యాత్వార్ధరాత్రేతుజపేన్మన్త్రంసహస్రకం। దశరాత్రజపాద్దేవమాకర్షేన్నాగకన్యకాం। కన్యకాస్త్రీదశాదీనాంకింపునర్మర్త్యయోషితః॥ ... ... *

మ॥ యమునావేణికయందుగోపికలునీరాడఁగ స్వకీయాంశుకౌ।
ఘములందాచఁగసిగ్గుచేమృదులవాక్యప్రౌఢితోవేడుకఁగ। సముదంచ
న్మదనాలసోల్లసనిరీక్షానీలనీరేజమా। ల్యములన్వారలుపూజచేయఁ
దగునయ్యబ్జాక్షునింజూచెదఁగ॥ ... ... 3

తా. నిర్మలంబగుయమునోదకంబుననోలలాడుచు దాచంబడినచేలంబులననునయవచనంబులచే వేడుకొనుస్త్రీలయొక్క-లజ్జయనియెడి యుపాధివలనఁజంచలంబులైమన్మథోద్దీపకంబులైయలసంబులైవిలసిల్లు నేత్రదామరలచేనర్చింపఁబడుశ్రీకృష్ణుండు ననురక్షించుఁగాకయనుట. ... *

శ్లో॥ మాతర్నాతఃపరమనుచితంయత్ఖలానాంపురస్తాదస్తాశ
ఙ్కంజఠరపిఠరీపూర్తయేనర్తితాసి। తత్క్షన్తవ్యంసహజసరళేవత్సలే
వాణికుర్యాంప్రాయశ్చిత్తం గుణగణనయా గోపవేషస్యవిష్ణోః॥ ౪

టీక. సహజసరళే-సహజ- స్వభావమయిన, సరళే-ఋజుహృదయముగలయదియు, మాతః-తల్లియైనదియు, వత్సలే-దయావతియైనదియునగు, హేవాణి-ఓసరస్వతీ, జఠరపిఠరీపూర్తయే-జఠర-ఉదరమనియెడి-పిఠరీ-పనటియొక్క, పూర్తయే-పూరణముకొఱకు, ఖలానామ్-దుర్జనులయొక్క, పురస్తాత్-ముందరను,అస్తాశఙ్కమ్-సందేహములేనటుల,మయా-నాచేత, నర్తితాసీతియత్- నర్తనమునఁబొందింపఁబడితివనునదియేదికలదో, అతః-ఇంతకన్నను, పరం-అన్యము,అనుచితం-ఉచితముకానిది,నాస్తి-లేదు,తత్_అది, క్షన్తవ్యం-సహింపఁదగినది, గోపవేషస్య - గోపాలవేషముగల, విష్ణోః-శ్రీకృష్ణమూర్తి-యొక్క, గుణగణనయా- గుణకీర్తనముచేత, ప్రాయశ్చిత్తం- నిష్కృతిని, కుర్యాం-చేయుచున్నాను. ... ... *

చ॥ ఉదరమునించఁగోరిఖలులుండెడుతావులఁజేరివారికిం। బెదు

బనశంకనిన్ను నటియింపఁగఁజేసినపాతకంబులన్। సదయతనోర్వఁగా వలెఁబ్రసన్నమతిన్ననుఁగన్నతల్లి శ్రీ। రదయదువంశనాయకునిఁబ్రస్తుతినిష్కృతి సేనొనర్చెదన్॥ ... ... ... ౪

తా. స్వభావసిద్ధంబగుఋజుత్వంబుగలిగిననిమిత్తంబున మదీయపాపంబువిఫలంబుచేయనోపకయుండి జగంబులకెల్లదల్లియైనకతంబుననాకుందయైయత్యంతదయావతియైమదీయవాగ్రూపంబునంబరిణమించిన యోపరస్వతీదుర్జనులయెదుటనినునతనంబుచేయించినపాతకంబుసహింపవలయు నింక శ్రీకృష్ణునిగుణకీర్తనంబునందత్పాపప్రాయశ్చిత్తంబుఁజేయుచున్నాననుట. *

శ్లో॥ అఙ్గుళ్యగ్రైరరుణకిరణైర్ముక్తసంరుద్ధరంధ్రంవారంవారం వదనమరుతావేణుమాపూరయన్తం। వ్యత్యస్తాంఘ్రింవికచకమలచ్ఛాయవిస్తారనేత్రంవన్దేబృందావనసుచరితంనందగోపాలసూనుమ్॥ ౫

టీక. అరుణకిరణైః-అరుణ-ఎఱ్ఱనైన,కిరణైః-మయూఖములుగల, అంగుళ్యగ్రైః-వ్రేలికొనలచేత, ముక్తసంరుద్ధరంధ్రం-ముక్త-విడువఁబడినదియు సంరుద్ధ-కప్పఁబడుచున్నదియునగు,రంధ్రం-వివరముగలిగినటుల, వేణుం-పిల్లనగ్రోవిని,వదనమరుతా-ముఖవాయువుచేత, వారంవారం-మాటిమాటికిని, పూరయన్తమ్-నిండింపఁజేయుచున్నవాఁడును,వ్యత్యస్తాంఘ్రిం-వ్యత్యస్త-వ్యత్యయములైన, అంఘ్రిం-పాదములుగలవాఁడును, వికచకమలచ్ఛాయవిస్తారనేత్రం-వికచ-వికసించిన,కమల-తెల్లదామరతేకులయొక్క, ఛాయ-కాంతివంటికాంతిగల,విస్తార-విశాలములైన, నేత్రం- కన్నులుగలవాఁడును, బృందావనసుచరితం-బృందావన-బృందావనమందు, సుచరితం-శోభనసంచారముగల, నందగోపాలసూనుమ్-నందగోపాల-నందునియొక్క,సూనుమ్-కుమారుండైనశ్రీకృష్ణమూర్తినిఁగూర్చి,వందే-నమస్కరించుచున్నాను. ... *

మ॥ అరుణశ్రీదళుకొత్తనంగుళులనొయ్యన్గప్పుచున్విప్పుచున్మురళీరంధ్రములాస్యమారుతమునంబూరించునొయ్యారమై। చరణద్వంద్వముమార్పడన్నిలుచుకంజాతాయతాలోకభా। సురబృందావనమందిరాంతరచరిష్ణుంగృష్ణుఁగీర్తించెదన్॥ ... ... ౫

తా. కెంపుసొంపులందేజరిల్లునంగుళాగ్రంబుల వేణురంధ్రంబులంగప్పుచునువిప్పుచునుముఖమారుతంబున సారెసారెకును వేణువుంబూరించుచువామదక్షిణపాదంబులదక్షిణవామభాగంబులఁదనరం బృందావనంబునఁ జరియించుగోపాలకృష్ణునింగూర్చి మ్రొక్కుచున్నాననుట. ... ... *

శ్లో॥ మన్దంమన్దంమధురనినదైర్వేణుమాపూరయన్తం బృన్దాటవిభువిగవాంచారయన్తంచరన్తమ్ । ఛందోభాగేశతమఖముఖధ్వంసినాందానవానాంహన్తారంతంకథయరసనేగోపకన్యాభుజఙ్గమ్॥ ౬

టీక. మధురనినదైః-మధుర-మనోహరములైన, నినదైః-ధ్వనులచే మన్దంమన్దం-మెల్లమెల్లన, వేణుం-పిల్లనఁగ్రోవిని ఆపూరయంతమ్-నిండింపఁ జేయుచున్నవాఁడును, బృందావనభువి-బృందావనప్రదేశమందు, గవాం-గోవులయొక్క, బృందమ్-సమూహమును, చారయన్తమ్- సంచరింపఁజేయుచున్నవాఁడును, ఛన్దోభాగే- వైదికదేశమయిన వేదాంతమందు, చరంతమ్- సంచరించుచున్నవాఁడును, శతముఖముఖధ్వంసినాం- దేవేంద్రుఁడు మొదలగువారలనడచుచున్న, దానవానాం-దనుజులను, హన్తారమ్- నాశనముచేయుచున్నవాఁడును, తం-ఆప్రసిద్ధుఁడునైన, గోపకన్యాభుజంగమ్-గోపికావిటుఁడైనకృష్ణుని, హేరసనే-ఓనాలుకా, కథయ-కీర్తింపుము. ... ... *

శా॥ బృందారణ్యతరుప్రదేశములగోబృందంబులన్మేపుచున్మందంబౌమధురధ్వనిన్మురళిఁబల్మాఱున్వినోదింపుచున్। ఛందోవీథిఁజరించుచున్విమతరక్షస్తోమవిధ్వంసనా। నందుండైనవ్రజాంగనావిటురసజ్ఞా ప్రజ్ఞఁగీర్తింపుమా॥ ... ... ... ... ... ౬

తా. మనోహరంబులగు నాదంబులచే మెల్లమెల్లన వేణువు నిండింపఁజేయుచుబృందావనంబునగోగణంబులను మేపుచును వేదాంతవీధులం జరియించుచు నెల్లదానవులంబోనడుచుచులోకప్రసిద్ధుండై వెలయు గోపికావిటుని నోనాలుకాకీర్తింపుమనుట. ... ... ... *

శ్లో॥ వేణీమూలేవిరచితఘనశ్యామపిఞ్ఛావచూడో విద్యుల్లేఖావలయితఇవస్నిగ్ధపీతామ్బరేణ। మామాలిఙ్గన్మరకతమణిస్తమ్భగమ్భీరబాహుస్స్వప్నేదృష్టస్తరుణతులసీభూషణోనీలమేఘః॥ ...... ౭

టీక. వేణీమూలే-వేణీ-కేశబంధవిశేషము యొక్క, మూలే-మొదటను, విరచితఘనశ్యామపిఞ్ఛావచూడః- విరచిత- ఉంచఁబడినదియు, ఘన-మేఘమువలె, శ్యామ-నల్లనైన, పిఞ్ఛ-నెమలిపురి, అవచూడః-శిరోభూషణము గలవాఁడును, స్నిగ్ధపీతామ్బరేణ-స్నిగ్ధ-స్వచ్ఛమయిన, పీతామ్బరేణ-పీతాంబరముచేత, విద్యుల్లేఖావలయితః-విద్యుత్-మెఱుపులయొక్క, లేఖా-పఙ్క్తిచేత, వలయితః-చుట్టుకొనఁబడిన, నీలమేఘఇవ - నీలమేఘమువలెనున్నవాఁడును, మరకతమణిస్తమ్భగమ్భీరబాహుః- మరకతమణి- ఇంద్రనీలమణివికా

రమైన- స్తమ్భ- స్తంభమువలె-గమ్భీర - గంభీరము లైన - బాహుః - బా
హువులుగలవాఁడును- తరుణతులసీభూషణః- తరుణ- లేఁతయగు- తుళసీ-
తుళసీమాలిక-భూషణః- అలంకారముగాఁగలిగినవాఁడు నైన శ్రీకృష్ణమూర్తి-
మాం-రుక్మిణీదేవిని- ఆలిఙ్గ్య-కౌఁగిలించినవాఁడగుచు- స్వప్నే- స్వప్నమం
దు-మయా-నాచేత- దృష్టః-చూడఁబడియెను॥ ఈశ్లోకార్థంబు గోపాలకృష్ణ
షోడశాక్షర మంత్రధ్యానంబని సనత్కుమార సంహితయందుఁ జెప్పఁబడి
యున్నది. ... ... ... ... ... ... ... ... *

శ్లో॥ వామాఙ్క-స్థితయావామపాణిపద్మస్థపద్మయా। పద్మావతా
రయాశ్లిష్టంరుక్మిణ్యాకనకాభయా । హరింత్రాపిఞ్ఛసచ్ఛాయ మాసీ
నాంకాఞ్చనామ్బుజే । ఆశ్లిష్యన్తంప్రియందేవ్యా ఘలోద్యద్వామపా
ణినా। సౌవర్ణవేత్రవిలసద్దక్షపాణితలంస్మరేత్ । పీతామ్బరధరంది
వ్యంభూషామాలావిభూషణం॥ ... ... *

చ॥ అలరుమెఱుంగురంగుగలహాటకశాటికమౌళిపాళిభా।సిలున
వపింఛకంబుతుళసీదళదామముగల్గినట్టిమే । ఘలలితమూర్తిమానిక
పుగంబముఁబోలిభుజద్వయంబుచే। నలమి రమావధూటిఁజెలువందఁ
గలన్గనుపించెనింపుగ౯॥ ... ... ౭

తా. తొలుకాఱుమెఱుంగురంగులందెగడుబంగరువలెవాటునుమౌళి
తలంబునంగనుపట్టునెమలిపురియునుందులసీదామంబునుంగలిగినీలమేఘంబుఁ
బోలిన శ్రీకృష్ణమూర్తినీలంపుకంబంబులందెగడు బాహుయుగళంబుచే రుక్మి
ణింగౌఁగిలించుకొనినాస్వప్నంబునం గానంబడియెననుట. ... ... *

శ్లో॥ కృష్ణేహృత్వా నిచయనిచయంకూలకుఞ్జాధిరూఢే। ముగ్ధా
కాచిన్ముహురనునయైఃకిన్న్వితివ్యాహరన్తీ। సభ్రూభఙ్గంసదరహసితం
సత్రపంసానురాగంఛాయాశౌరేఃకరతలగతాన్యమ్బరాణ్యాచకర్ష॥

టీ. నిచయనిచయం- నిచయ-వస్త్రములయొక్క-నిచయం- సమూ
హమును-హృత్వా-హరించి- కృష్ణే- శ్రీకృష్ణమూర్తి- కూలకుంజాధిరూఢే
కూల-యమునాతటమందలి- కుఞ్జ-పొదయందు- అధిరూఢేసతి-యెక్కినవాఁ
డగుచుండఁగా- కాచిత్- ఒకానొకతయైన- ముగ్ధా- ముద్దరాలు-ముహుః-
మాటిమాటికిని- అనునయైః-ప్రియవచనముల చేత- కిన్న్వితి- యేమిప్రయోజన
మని-వ్యాహరన్తీ- చెప్పుచున్నదియై-సభ్రూభఙ్గం-బొమముడితోఁగూడినటు
లను- సదరసహితం - చిఱునగవుతోఁగూడినటులను- సత్రపం- సిగ్గుతోడఁ

గూడినటులను- సానురాగం- అనురాగముతోఁగూడినటులను- ఛాయాశౌరేః-శ్రీకృష్ణచ్ఛాయయొక్క- కరతలగతాని-కేలనున్న- అమ్బరాణి-వస్త్రములను-ఆచకర్ష-లాగెను॥ ఈశ్లోకార్థంబు గోపాలకృష్ణమంత్రరాజవస్త్రాకర్షణప్రయోగధ్యానమని గోపాలకల్పమందుఁ జెప్పంబడియున్నది॥ ... ✽

శ్లో॥ కదమ్బవృక్షమారూఢం గోపీవస్త్రాపహారిణం । కృష్ణంధ్యా
త్వార్ధరాత్రేతుజపేన్మంత్రంసహస్రకం। దశరాత్రజపాదేవమాకర్షే
న్నాగకన్యకాః । కన్యకాస్త్రీదశాదీనాం కింపునర్మర్త్యయోషితః॥

ఉ॥ కోకలుముట్టిచ్చిలించితటకుంజగృహంబుననిల్వసిగ్గునన్। భ్రూ
కుటియున్ దరస్మితనిరూఢయుఁబ్రేమముఁదోఁపఁగట్టుకున్ । రాకయి
దేమితాతగదురాయనిముగ్ధవధూటిసీటిలోఁ । జేకొనఁబూనెనీడయ
గుచిన్నిముకుందునిచేతిచేలముల్॥ ... ... ౮

తా. వస్త్రసమూహంబుల నపహరించి శ్రీకృష్ణుండు యమునాతటంబునందుండిన వృక్షంబునధిరోహింపనొకముగుదయైనగోపికప్రియవచనంబులనిదియేమిప్రయోజనంబనినుడువుచు బొమముడియునుచిఱునగవునుసిగ్గునను రాగంబునుందెలుపుచు నీడయగు కృష్ణునికరతలంబులందుండిన చేలంబులనాకర్షించెననుట. ... ... ... ✽

అవతారిక॥ కవియొకానొకగోపిక మనోరథముంజెప్పుచున్నాఁడు.

శ్లో॥ అపిజనుషిపరస్మిన్నాత్తపుణ్యోభవేయంతటభువియమునా
యాస్తాదృశోవంశనాళః। అనుభవతియఏషశ్రీమదాభీరసూనోరధర
మణిసమీపన్యాసధన్యామవస్థాం॥ ... ... ౯

టీక. పరస్మిన్- యితరమైన- జనుషి-జన్మమందు-ఆత్తపుణ్యః- ఆత్త-పొందఁబడిన-పుణ్యః-పుణ్యముగలదగుచు- యమునాయాః-యమునానదియొక్క--తటభువి-తీరదేశమందు-తాదృశః- శ్రీకృష్ణాధరమునుబొందయోగ్యమైన-వంశనాళః-వేణువు-భవేయమపి-అయినప్పటికిని-యయేషః- యేయమునాతీరమందుఁబుట్టినయీవేణువు-శ్రీమదాభీరసూనోః-శ్రీమత్- సంపత్తుగలదైన-ఆభీరసూనోః-శ్రీకృష్ణమూర్తియొక్క--అధరమణిసమీపన్యాసధన్యాం- అధరమణి-మణివంటియధరముయొక్క--సమీప- ప్రాంతమందు-న్యాస- ఉంచుటచేత-ధన్యాం-కృతార్థమైన-అవస్థాం- దశను-అనుభవతి-అనుభవించుచున్నది. ✽

ఉ॥ నందతనూజుమోవిరతనంబునసమీపముచేరిధన్యతం। బొందెఁ

గళిందజాతటముపొంతవసించినవంశనాళమా। యందముగాంతునో
క్కొ-జననాంతరమందియ శేషసతిక్రియా। బృందము వెంటనంటిఫల
ముయ్యఁగఁగోర్కు-లపంటపండఁగ౯॥ ... ... ౯

తా. శ్రీకృష్ణుని కెమ్మోవి రతనంబుపొంతంజేరి యమునాతటంబున
బొడమినవంశనాళంబుపవిత్రంబయ్యె నేనునటులజన్మాంతరంబుననైన శేషస
త్కర్మఫలంబులచేనైనందాదృశవంశనాళంబుపోల్కి- కృతార్థత్వంబునొందు
దునోకోయని యొకవ్రేత మనంబునందలంచెననుట. ... ... *

శ్లో॥ అయిపరిచినుచేతఃప్రాతరమ్భోజనేత్రంకబరకలితచఞ్చత్పి
ఞ్ఛదామాభిరామమ్। వలభిదుపలనీలంవల్లవీభాగధేయంనిఖిలనిగమవ
ల్లీమూలకన్దంముకున్దమ్॥ ... ... ... ... ... ౧౦

టీక. అయి-ఓ-చేతః-చిత్తమా- ప్రాతరమ్భోజనేత్రం-ప్రాతరమ్భో
జ-ప్రాతఃకాలకమలములవంటి-నేత్రం- కన్నులుగలవాఁడును- కబరకలితచ
ఞ్చత్పిఞ్ఛదామాభిరామమ్-కబర-సిగయందు-కలిత-చుట్టబడి- చఞ్చత్-ఒప్పు
చున్న-పిఞ్ఛదామ-నెమలిపురిదండచేత- అభిరామం-సుందరుఁడైనవాఁడును-
వలభిదుపలనీలం-వలభిదుపల- యింద్రనీలమణివలె- నీలం-నీలవర్ణుఁడైనవాఁడు
ను-వల్లవీభాగధేయం- వల్లవీ-గోపస్త్రీలయొక్క- భాగధేయం- భాగ్యస్వ
రూపుఁడైనవాఁడును-నిఖిలనిగమవల్లీమూలకన్దం- నిఖిల-సమస్తమైన- నిగమ-
వేదములనియెడి-వల్లీ-తీవియలయొక్క-మూల-మొదటిదియగు- కన్దం-గడ్డయై
నవాఁడును-ముకున్దం-శ్రీకృష్ణమూర్తినిగూర్చి-పరిచిను-పరిచయముచేయుము.

మ॥ లలితాంభోరుహనేత్రు గోపరమణీలావణ్యపాత్రున్సము।
జ్జ్వలపౌరందరనీలగాత్రుఁగబరాంచత్పింఛలీలున్విని। శ్చలవేదాంత
లతాలవాలుమురళీసంగీతలోలుఁ దయా। నిలయుఁ సన్మతిమీరఁగో
రి మనమా నిత్యంబుసేవింపుమా॥ ... ... ౧౦

తా. ఓ మనంబా దినముఖంబునంబొల్చు విరిదమ్మి రేకులుంబోలికన్నుఁ
గవచేఁ దేజరిల్లిసిగయందునలంకరింపఁబడిన నెమలిపురిదండచేనభిరాముఁడగు
-చునింద్రనీలరతనంబుంవలె నీలకాంతిగలిగి గోపస్త్రీభాగ్యరూపంబై యెల్ల
వేదంబులకునాదికారణుండై వెలయుశ్రీకృష్ణమూర్తింగూర్చి మిక్కిలియుంబరి
చయంబుచేయుమనుట. ... ... ... *

శ్లో॥ అయిమురళిముకున్దస్మేరవక్త్రారవిన్దశ్వసనమధురసజ్ఞేత్వాం

ప్రణమ్యాద్యయాచే। అధరమణిసమీపంప్రాప్తవత్యాంభవత్యాంకథ
యరహసికర్ణమద్దశాంనన్దసూనోః॥ ... ... ... ౧౧

టీక. ముకున్దస్మేరవక్త్రారవిన్దశ్వసనమధురసజ్ఞే - ముకున్ద- శ్రీకృష్ణమూర్తియొక్క- స్మేరవక్త్ర నగుమొగమనియెడి- అరవిన్ద-కమలముయొక్క- శ్వసన-విశ్వాసమనియెడి-మధు-మకరందముయొక్క- రసజ్ఞే- రసము నెఱింగిన-అయి మురళి-ఓవంశనాళమా- త్వాం-నిన్నుఁగూర్చి- అద్య-యిప్పుడు-ప్రణమ్య-నమస్కరించి-యాచే-యాచించుచున్నాను-భవత్యాం-నీవు- అధరమణిసమీపం- అధరమణి- మణివంటియధరముయొక్క- సమీపం- సమీపమును-ప్రాప్తవత్యాం - పొందుచుండఁగా - నన్దసూనోః - శ్రీకృష్ణమూర్తియొక్క- కర్ణే- చెవియందు- రహసి- యేకాంతమున- మద్దశాం- నాయవస్థను- కథయ - చెప్పుమా. ... ... *

చ॥ హరియధరాంతికస్థలవిహారమునన్ స్మితపూర్ణవక్త్రతా।మ
రససమీరసీధురసమాధురిఁజెందిననిన్ను వేడెద। న్మురళిరొనందసూను
మదినూల్కొనఁగాఁజెవిడండనుండియె। వ్వరువినకుండనాదువలవంత
సమస్తముఁజెల్పుమొక్కెదన్॥ ... ౧౧

తా. శ్రీకృష్ణునినగుమొగంబుఁ దామరంబొడమునిట్టూరుపు తేనియచవినెఱింగినయోపిల్లనఁగ్రోవి నినుంగూర్చిమ్రొక్కి వేడెదనీవురతనంబుఁబోనియధరంబుసమీపంబునఁజేరినయెడ శ్రీకృష్ణునిచెవియందేకాంతంబుననాయవస్థంజెప్పుమనుట. ... ... ... *

శ్లో॥ సజలజలదనీలంవల్లవీకేళిలోలం శ్రితసురతరుమూలంవిద్యు
దుల్లాసిచేలం। నతసురమునిజాలంసన్మనోబిమ్బలీలంసురరిపుకులకా
లంనౌమిగోపాలబాలం॥ ... ... ౧౨

టీక. సజలజలదనీలం-సజల-నీటితోఁగూడిన- జలద- మేఘమువలె-నీలం-నల్లనైనవాఁడును-వల్లవీకేళిలోలం- వల్లవీ- గోపస్త్రీలయొక్క- కేళి-సల్లాపాదులయందు- లోలం- ఆసతోఁగూడినవాఁడును - శ్రితసురతరుమూలం-శ్రిత- ఆశ్రయింపఁబడిన-సురతరు- కల్పవృక్షముయొక్క- మూలం-మొదలుగలవాఁడును-విద్యుదుల్లాసిచేలం-విద్యుత్- మెఱుపువలె-ఉల్లాసి- ప్రకాశించుచున్న- చేలం- వస్త్రములుగలవాఁడును- నతసురమునిజాలం- నత-నమ్రులైన-సుర- దేవతలయొక్కయు- ముని-మునులయొక్కయు- జాలం-సమూహములుగలవాఁడును-సన్మనోబిమ్బలీలం- సత్ - సత్పురుషులయొక్క

మనః-మనస్సులయందు,బిమ్బ-సాకారము లైన, లీలం-విలాసములుగలవాఁడు ను,సురరిపుకులకాలం-సురరిపు-రాక్షసులయొక్క, కుల-వంశములకు, కాలం-యమప్రాయుఁడైనవాఁడును,గోపాలబాలం-గోపాలబాలుండు నైన(కృష్ణుని) నౌమి-నుతించుచున్నాను॥ ఈశ్లోకార్థంబు గోపాలకృష్ణ ద్వాదశాక్షరీ మంత్ర ధ్యానమని సనత్కుమార సంహితయందుఁ జెప్పంబడి యున్నది.

శ్లో॥ ధ్యాయేతకల్పద్రుమాధస్తాన్మణిపీఠాబ్జగంశుభమ్ । కృష్ణంపీతామ్బరధరంశఙ్ఖచక్రకరామ్బుజమ్ ॥ పిఞ్ఛమానంసుధాకుమ్భైరైరావణకరామ్బైః । శక్రేణశాంతదర్పేణసన్నుతంతపసాత్మనా॥ స్తూయమానంసురగణైః పుష్పవృష్టికరైర్దివి । సేవ్యమానంచమునిభిస్సిద్ధస్సార్థైర్మహోరగైః॥

మ॥ సజలాంభోధరజాల నీలువిలసత్సౌదామినీచేలునిఁ । వ్రజ
భామానన కేళిలోలుని సుపర్వద్వేషకృత్కాలునిఁ। ద్విజరాణ్మానస
బింబలీలుని శ్రితాదిత్యద్రుమావాలునిఁ । భజియింతున్మదిగోపబాలు
నతనానా దేవతాజాలునిఁ॥ ... ... ౧౩

తా. నీరంబుతోఁడంగూడిన మొగులుంబోలె నల్లనై గోపికల సల్లాపాదిక్రీడలయందాసించుచుఁ గల్పవృక్షమూలంబుననుండి మెఱుఁగుబోని చేలంబమర సర్వదానవ వంశ నాశకుండై దేవతలు మునులు భజియింప సత్పురుషుల యెదుట సాక్షాత్కరించుచు వెలుంగు గోపాలబాలు నుతించు చున్నాననుట. ... ... ... ... *

శ్లో ॥ అధరబిమ్బవిడమ్బితవిద్రుమం మధుర వేణునినాద వినోదినం।కమలకోమలక్రమ ముఖాంబుజంకమపిగోపకుమార ముపాస్మహే॥

టీక. అధరబిమ్బవిడమ్బితవిద్రుమమ్- అధరబిమ్బ-దొండపండువంటి యధరము చేత, విడమ్బిత-అపహసింపఁబడిన, విద్రుమమ్- పవడముగలవాఁడును, మధుర వేణునినాదవినోదినమ్-మధుర-శ్రావ్యమయిన, వేణునినాద-వేణునాదము చేత, వినోదినం- కాలముగడుపుచున్నవాఁడును, కమలకోమలక్రమ ముఖామ్బుజం-కమల-కమలమువలె,కోమల-మృదువైనయదియు, క్రమ-సుందరమైనదియునగు, ముఖామ్బుజం-ముఖకమలముగలవాఁడును, కమపి-ఇట్టిదనిచెప్పనలవిగానివాఁడునునగు, గోపకుమారం- శ్రీకృష్ణమూర్తిని, ఉపాస్మహే-ఉపాసించుచున్నాను. ... ... ... *

మ॥ మురళీనాదమధూళికాకలితసమ్మోదుఁ సుధాసారమే। దు
రబింబాధరధూత విద్రుమ వినోదుఁ రాధికాంఘ్రిద్వయీ। వరలా

